# సృష్టిమూలం - విశ్వావిర్భావం








గ్రంథకర్త

చెట్టి లక్ష్మయ్య ముత్తరాజు

1997



ఆదర్శ

మాత - పితమహులకు

అంకితం

# కృతి

ఘనుడవోయి నీవు ఘనుడవోయి నీవు,

ఘణతంత్రములేసాచినావు, ఘనుడ ॥

సాటిలేనివాడవు - స్వరూపమైన జూపరావు - ఘనుడ ॥

ముజ్జగములు ఎలువాడవు - ముమ్మా ప్రాణులను సృజయించినావు,

సంచరించే ప్రాణులకు - సర్వధికారుడవోయి - ఘనుడ ॥

కాయకల్పము జూపి - కంటిలోన వెలుతు కలిగించినావు,

కారణమున పడవేసి - కనబడనైతివి నేడు - ఘనుడ ॥

మనుజులను సృజయించినావు - మాయాజాల మేర్పరచినావు,

మర్మమును తెలుసుకోలేక - మృతి జెందెరు నేడు - ఘనుడ ॥

నీ దాసు దాసులగు - నిన్నే నమ్మియున్నారు,

దర్మలక్షణములచే - దయజూపనైతివి నేడు - ఘనుడవోయి ॥

సి. లక్ష్మయ్య
స్వాతంత్ర్య సమరయోధుడు

# కృతిజ్ఞతలు

సృష్టిమూలం-విశ్వావిర్భావం గురించి పలువిధములుగా వ్రాయడం జరిగింది, జరుగుచున్నది. వేదాలలో, ఉపనిషత్తులలో, యోగశాస్త్రములలో, మనుస్మృతిలో అనేక రూపములలో చూపినారు. మతపరమైన బైబిల్-ఖురాన్ అటువంటి గ్రంథములలో ఉపనిషత్తుల పోలికలు కనబడుచున్నవి. అచల పరిపూర్ణ గురు ఉపదేశముల మంజరిలోను, దేవి భాగవతమున చూపిన ఆధారములుయున్నవి.

విశ్వావిర్భావం విజ్ఞానశాస్త్రములు - శాస్త్రజ్ఞులు పలు విధముగా చూపడము జరిగినది. బిగ్‌బ్యాంగ్ సిద్ధాంతము శ్రీ డార్విన్ పరిణామ వాదములో చూపిన విషయములు, ఇతర శాస్త్రజ్ఞులు చూపలేదు. అప్పటి పరిణామవాదముయొక్క గొప్పతనము వారికి దక్కినది. వారికి నా హృదయపూర్వక నమస్సులు. ఇప్పటి శాస్త్రజ్ఞుల యొక్క పరిశీలన సృష్టికి విపరీతము గాను, ప్రతి సృష్టి చేయుట సంకల్పము మానవ జాతికే కాకప్రకృతి విరుద్ధమైన పరిణామము జరుపుటచే ఈ చిన్న గ్రంథము ఆవేదనతో వ్రాయుడము జరిగినది. దీనికి పెద్దలు అనుభవముగలిగినవారు మహాకవి, పద్మశ్రీ బోయి భీమన్నగారు బ్రహ్మజ్ఞాని, ప్రవేశిక పీఠిక వ్రాయుటకు మొట్టమొదటి వారు సమ్మతించి వ్రాసినటువంటి విషయము చిన్న గ్రంథముగా కనబరుచుచున్నట్లుయున్నది. వారికి నా మనోవాక్కులు. –

మిత్రులు-అప్తులు డా॥ ఎం. కులశేఖరరావు గారు తమ పరిచయమును, బ్రహ్మజ్ఞాన రూపములో పుస్తక పరిచయము చేసినారు. వీరకి నా హృదయ పూర్వక ధన్యవాదములు. --

డా॥ యస్. జి. రామానుజాచార్యులు, మాత్రుతు, ఆప్తులు, శ్రేయోభిలాషులు మరియు ఆత్మీయులు. ప్రతి గ్రంథము వ్రాసిన తర్వాత వారు, ఎన్ని పనులు ఉన్న సమయము లేకున్నా మా గ్రంథములను చదివి తప్పు ఒప్పులను సరిజేసి యిచ్చేవారు. వారి నుండియే ఈ గ్రంథరచనలు చేయుట సాహసము ఏర్పడినది. వారికి నా మనోకృతజ్ఞతలు చెప్పుచున్నాను.

వెచ్చించుచున్నారు. కాని ఫలితము శూన్యవ్యవస్థకు తీసుకెళ్ళుతున్నారనేది నిశ్చితము. సైంటిస్టులే అంటున్నారు. కొంత కాలమునకు సూర్యుడు అనగా అగ్నిగోళములు, నక్షత్రగోళములు సైతము భూమిపై కూల వచ్చునని చెప్పుచున్నారు. వాల్మీకి ప్రకరణముల తొమ్మిదవ అధ్యాయమున చూడుడు. మానవుడు తన పరిధిని దాటి భూపదార్థములను తీసి పరిశీలించుట తన కర్తవ్యమని భావించుట సరికాదు. భూమిపై వున్న ప్రకృతి సంపదలో నుండి వెలకితీయడము మానవునికి కావలసినది సృష్టించడమే నిజమైన శాస్త్ర జ్ఞానము, భూమి అడుగు భాగమును తెలుసు కోవాలని తహతపడుతున్నాడు. ఇక్కడ తనకు తాను నేనెవరిని యని తెలుసుకోవాలని తహతపడుతున్నాడు. ఇక్కడ తనకు తాను నేనెవరని యని తెలసుకుంటే చాలు భూమి అడుగు తెలుసుకున్న వాడౌతాడు లేక భూమిని బద్దలు చేసి తెలుసుకోవడము అంత సమంజసముకాదు. తనకు తానే గోతిని త్రవ్వుకున్నట్లు అవుతుంది. ఇక్కడ మనము నిలుచున్న ఫోటో తీసుకుంటాము. మొత్తము శరీరముతో ఛాయపడుతున్నది. కానీ కాళ్లయొక్క పాదం అడుగు భాగం కనబడుతుందా? అనేది ముఖ్యము, అది ఎప్పుడు తెలుసుకుంటారో అప్పుడే భూమి అడుగును తెలుసుకొన్నవారు అవుతారు.

అది సృష్టిలో ఒక వింత కథ చూచినది ఏమనగా ఒక మానవుడు నక్షత్ర మండలము నుండి ఒక (సాసర్) అనగా వాయునౌక మీద వచ్చి భూమిపైన దిగినాడు. ఆ వాయు వాహనమునకు ఏ మిషనరి లేదు (తైలం) పెట్రోలు లేకుండ వచ్చినాడు. ఆ విధముగా కొంత కాలము క్రిందట ఫ్రాన్స్‌లోను దిగినట్లు వార్తలు వచ్చినాయి. మరియు కొద్ది కాలము క్రింద రెండుసార్లు రష్యాలో దిగినట్లు దక్కన్‌క్రానికల్ పత్రికలలో వార్తలు వచ్చినట్లు కనబడినది.. ఇప్పుడు అమెరికాలో వున్న వింత మనిషి నుండి వారి రాక గురించి ఇతర నక్షత్రమునుండి మండలాల గురించి రాబట్టుటకు సైంటిస్టులు ప్రయత్నాలు చేస్తున్నారు. కనుక సైంటిస్టులతో మనవి ఏమంటే భూమిలోని పదార్థములను వెలితీయకుండ ప్రకృతి సంపద నుండి వెలితీయడము మానవజాతికి ఎంతో మేలు చేసినవారవుతారు. పూర్వపుఋుషులలో కపిలుడు, ఖానాది కూడ సాంఖ్యశాస్త్రము మరియు అణుశాస్త్రమును వ్రాయగల్గినారు. మరియు భూమిలోని పదార్థములతో సైతము

చూపినారు. భూమి త్రవ్వకాలు కాని భూమి బద్దలు చేసి చూపినది కాదు, వారికీ మనకూ తేడా ఏమున్నదో తెలుసుకొని, వారి అడుగుజాడలలో నడవగలరనియు, ప్రకృతి సంపదనుండి విజ్ఞానముతో ప్రజలకు కావలసినది బైటకు లాగి చూపగలరని ఆశిస్తున్నాను.

ఇక్కడ ఐదవ ప్రకరణమున, రెండవ అధ్యాయమున సృష్టి ఉద్భవమును గురించి సరికొత్త థియోరిని తెలుసుకొని సృష్టి ఎట్లు పుట్టినది సైంటిస్టులు మతగ్రంథములు, ఉపషనిత్తులు చూపని విషయమును వేదమంత్రం యొక్క ఆధారమున ఈ థియోరిని ఎవరు తెలుసుకొంటారో, తెలుసుకొని అర్థంచేసుకోగలరో వారు నిజమైన విషయమును పరిశీలించి సృష్టి ఉత్పన్నమును గ్రహించిన వారుఅవుతారు. సృష్టికి మూలం రెండు 'అణు పదార్థములు' ఈ అణు పదార్థములను కదలించుటకు ఒక మహత్తర శక్తి నుండి జరిగినది అని ఆవేద మంత్రం చూపినది. దీనిని ఎవరు కాదనలేరు. పరమాణువులు, ప్రకృతి ఏర్పడిన తర్వాత దొరికినవే కాని అంతకు ముందు పరమాణువులు ఉండేన? అనే ప్రశ్న ఉదయించును. ఆ అణువులు ఇప్పుడు కనిపించవు. అవి ప్రకృతికి మూలమై హిరణ్యగర్భముతో కలసిపోయినవని తెలుసుకొనవలెను. అణువు విభజించనిది. పరమాణువును విభజించుట జరుగుచున్నది. దాని నుండియే / ఆటోమిటిక్ పవర్‌ను లేక ఆటంబాంబును తయారు చేయగలిగినారు భౌతిక వాదమును చూడుడు. కనుక అణువు నుండి అగ్ని ఎప్పుడు ఏర్పడినదో అప్పుడే అణువులు అందులో లీనమైనదని తెలుసుకొనగలరు. మరల వాటికి జన్మలేదు. దొరుకుచున్నవి పరమాణువులు మాత్రమే. ఈ సృష్టి మూలము - విశ్వావిర్భావమును గురించి ఈ చిన్న గ్రంథంలోన ఒకటవ ప్రకరణముతో ప్రారంభించి తొమ్మిదవ ప్రకరణముతో అందరికి తెలియునట్లు చూపడం జరిగినది. మరియు పది పదకొండవ ప్రకరణములో ఆత్మ - పరమాత్మ- జీవాత్మల గురించి కూడ చర్చనీయాంశాలతో నేటి వామ మార్గులకు తెలియుటకై చూపబడినది. ఇదియును కాక మూఢ విశ్వాసములతో వడుచు పెద్దలు కూడా తెలుసుకోవాలి అనేది నా లభిప్రాయము. సత్యమును గ్రహించుటచే మానవుడు ఎంతో ఆనందదాయకుడు అవుతాడు. ఇది మిమర్శయని కాదు, నా అనుభూతితో తెలుసుకొని వ్రాయడం అయినది. (సత్యమును చెప్పినవానికి స్థానం లేదు - వాని

పేరు, ఊరు కూడ చూపరనేది ఈనాడు తెలుసుకొన్నాను). ఏనాటికైనా సత్యమనేదే మనకు తోడు, నీడ ఇచ్చును. అది తెలిసినవారికే తెలుసును. ఇంతకన్న ఎక్కువ సంఘర్షణలో పడదలచుకోలేదు. తెలిసిన వారికి తెలికపిండి తెలియని వారికి గానుగ పిండియనే సామెత మనకు ఉన్నది. మానవుడు తనకుతాను ఎప్పుడు పిండిని - పిండమును తెలుసుకుంటాడో అప్పుడే అతనికి ముక్తి ప్రాప్తియగును. ముక్తి ప్రాప్తించిన వారికి మోక్షము పొందుదురు.

ఈ గ్రంథము వ్రాయుటకు నా శక్తికి మించినదని తెలిసి, తెలుసుకొని తెలియపరచుట నా కర్తవ్య భావముతో ఇప్పటి వారు ఒప్పుకొన్నా, ఒప్పుకొనక యుండిన భావి మానవులు మాత్రము తప్పక ఒప్పుకొని, తమ ప్రపంచము లేక తాము నిలబడిన ప్రకృతిని, భూమిని సైతం కాపాడుకొంటారని ఆశిస్తున్నాను.

సైంటిస్టులు, విజ్ఞాన శాస్త్రజ్ఞులునేడు జరుపబోయే భూమిని కదలించుట ప్రయత్నము, జపానుకు చెందిన సైంటిస్టు ఓజాకి, అమెరికా శాస్త్రజ్ఞులు మానుకొన్నట్లవుతే మీరే దేవతలని ప్రజలు నమ్ముతారు, పూజించుతారు. కనుక నేను సైంటిస్టును కాకపోయిన విశ్వా - విర్భావసిద్ధాంతమును చూచిన తర్వాత నాలోన ఒక భావన లేక ప్రేరణ అనునది వచ్చినది. తర్వాత ఈ గ్రంథ రూపమున తెలయిపరచుట నా కర్తవ్యమని భావించి, మీ ముందు పెట్టినాను. మనకు లభించు పవిత్ర గ్రంథములలో ఒకటి రామాయణము, అందు రాజ ఋషియైన విశ్వామిత్రుడు ప్రతి సృష్టికర్తయని చెప్పుకొనుట కద్దు. తాను బ్రహ్మ ఋషి కావలెనన్న తపస్వి గాయిత్రి మంత్రమును సృష్టించినారు. కనుక రెండవ సృష్టి కర్తయని చెప్పుట నిశ్చితము.

ఈ ఆత్మ ఎంత శోభించుచున్నదో మీరు ఎరుంగనున్న వారైతే తప్పక మానుకొని ప్రళయమును సృష్టించరని అనుకొంటాను. ఒకవేళ ప్రళయమే వస్తే ప్రళయభూతుడేవరు అవతరించగలరు? లేదు ఈ సైంటిస్టులే ప్రతి సృష్టిని ఏర్పరచగలరా? అనునదియే నా అనుమానం లేక నా అభిప్రాయంతో ఏకీభవించినట్లువుతే పూజ్యనీయులు అగుతారు.

చెట్టి లక్ష్మయ్య ముత్తరాజు

మహాకవి, పద్మశ్రీ
బోయి భీమన్న
ఇంటి నం. 1 సి-85,
ఎర్రమంజిల్ కాలనీ,
హైద్రాబాద్ - 82.

# ప్రవేశిక

సృష్టిమూలము - విశ్వావిర్భావము అనే ఈ గ్రంథానికి కర్త చెట్టి లక్ష్మయ్యగారు వీరు సికింద్రాబాదులోని లాలాపేట వాస్తవ్యులు, ప్రస్తుతము 74 సంత్సరాల వయస్సులో రచనలు చేస్తున్నవారు. నాకు చిరపరిచితులు. నాకు లాగే భారతీయతను పరిశోధిస్తూ గతాన్ని త్రవ్వి రత్నమాణిక్యాలను గంపలకెత్తుతున్నవారు.

లక్ష్మయ్య గారు ఇంతవరకు వ్రాసిన గ్రంథాలలో (1) తెలుగు ముత్తరాజుల సంగ్రహ చరిత్ర (2) ప్రవర ఋషి గోత్రాలు ముద్రించబడినవి. కోలి వంశావళి అనేది మూడవ గ్రంథం. హిందీలోకి కూడా అనువదించబడింది. ముద్రించబడవలసి యున్నది. ముద్రించిన రెండు గ్రంథాలను నేను చూచాను. విశిష్టమైన పరిశోధన.. అద్భుతమైన ఆవిష్కరణ.

ఈయన ముత్తరాజు కులానికి చెందిన జ్ఞాని, విజ్ఞాని. అసలు ఈ భారతజాతి యేమిటి? ఈ కులాలు యేమిటి? కులాలు అవయవాలు లాంటివి అనుకుంటే, వీటి మధ్య హెచ్చు తగ్గులు ఏమిటి. ఒకదాని నొకటి పొడుచుకు చస్తున్నాయియెందుకు కన్ను చెవిని చేయికాలుని అవమానించి హింసించవచ్చునా - ఇలాంటి ఆలోచనలతో లక్ష్మయ్య గారు పడిన బాధ ఎంతో ఆయన గ్రంథాలను పరిశీలిస్తే తెలుస్తుంది. అందుకే ఆయన నాలాంటి వాడన్నాను. భారతజాతి సమగ్రాభివృద్ధిని గాఢంగా ఆకాంక్షించే మాకు ఈ అవ్యవస్థ అంతా ఏమిటో తెలుసుకొనేవరకు - నిద్రపట్టదు. మనకెందుకు లెమ్మని ఉపేక్షించి అందరిలాగా ఏదో బ్రతికేసే తత్వంకాదు. ప్రస్తుతాన్ని శోధించాలి, గతాన్ని త్రవ్వాలి, వ్యాధి మూలం తెలుసుకోవాలి. పరిష్కార మార్గాన్ని సూచించాలి . ఇదీ మా మనస్తత్వం మా వ్యథ. మా నిరంతర కృషి.

ఈ విషయాలను గురించి ఆలోచిస్తున్న మేధావులు దేశంలో చాలా మందే ఉన్నారు. ఐతే అందులో పరమ సత్యాలను పైకి తీస్తున్న వాళ్లు చాలా తక్కువ. నిజానికి లేరనే చెప్పాలి. ఎందుకంటే ఈ పరిశోధకులు, పండితులు ఎక్కువగా పైకులాల వాళ్లుకులం కారణంగా బాధలు పడుతున్నవారు కాదు. నిజాలు తెలుసుకొని వెల్లడించడం వల్ల వాళ్ళకు వచ్చే అదనపు లాభాలు యేమీలేవు.

బాధితుడే తమ బాధలు తొలగించుకోవడానికే కృషిచేయవలసియున్నది. ఈ దేశంలో బాధితులంతా క్రింది కులాల వాళ్ళే.. వాళ్ళే మెజారిటి ప్రజలుయైనప్పటికీ తరతలుగా చదువుసంధ్యలు నిషేధించబడడంవల్ల బాధలు పడుతూనే యున్నారు. తమ బాధలకు కారణాలేమిటో తెలుసుకునే అవకాశాలులేక కృషిల్లి పోతూనే ఉన్నారు, లక్ష్మయ్యగారి లాంటి ఆత్మజ్ఞునుడు, జిజ్ఞాసువులు, సత్యశోధకుడు చాలా తక్కువ.

ఇప్పుడు ఈ "సృష్టి మూలము" గ్రంథాన్ని పరిశీలించి చూచినప్పుడు, ఇందులోని అచ్చు తప్పుల్నీ, బాషాలోపాలనూ పక్కనబెట్టి, పరిశీలించి చూచినప్పుడు ఆధునిక పరిశోధన రంగంలో ఇంతటి ఉత్తమోత్తమమైన, అమూల్యమైన గ్రంథం మరొకటి లేదనిపించింది నాకు. అద్భుతమైన విషయాలను వెల్లడించారు అక్ష్మయ్యగారు ఈ గ్రంథంలో.

మనుష్యులు వేరైనా ఆత్మ ఒక్కటే, అనే తాత్విక సిద్ధాంతం నుంచి అమెరికాలోని రెడ్ ఇండియన్ జాతి వరకు భారతీయులే అనే వక్కాణింపు వరకు ఎంతో పరిశోధన చేసి సిద్ధాంతీకరించారు ఇందులో. ఎన్నో మతాలనుంచి మత సాహిత్యంనుంచి ప్రపంచ మేధావుల రచనలనుంచి వేదాలనుంచి ఎన్నో ఉదాహరణలిచ్చారు. ఏక కణ జీవుల ఉత్పత్తినుంచి బిగ్ బాంగ్ సిద్ధాంతం వరకు " కారణమునకు కార్యము లింశమగును", అనే మూల సూత్ర ప్రతిపాదన దాకా లక్ష్మయ్యగారు వివరించారు. ఒక రత్నంకోసం అన్వేషిస్తూ పోతే మొత్తం రత్నాకరమే, రత్నగర్భే ఆయన చేతికందినట్టు కనిపిస్తుంది. అద్భుతమనిపిస్తుంది.

ముదిరాజులు యెవరనేది పరిశోధన వస్తూ ముదిరాజ శబ్దమే ముత్తరాసు అయింది. వెనక బడిన వర్గాలలో చేరింది. అది వాళ్ళ కర్మ అనే నిర్లక్ష్యానికి గురి అయింది. అంతకు మించి అసలు విషయానికి పోయినవాళ్ళు ప్రజలకు తెలియజెప్పిన వాళ్ళు నిజానికి లేరనే చెప్పాలి.

ముదిరాజు అనగానే మనకు యయాతి జ్ఞాపకం వస్తాడు. దేవయాని, శర్మిష్ఠ. ఆయన భార్యలు దేవయాని కొడుకులు యదువు, తర్వశుడు. తండ్రి చేత రాజ్యాధికారం లేకుండా శపించబడినవాళ్ళు. యదువంశం వాళ్ళే యాదవులు. ఈనాడు యాదవులు గొల్లలు, తురమలు వగైరా పేర్లతో పిలువబడుతున్న కులాలు ఈ యదువంశం వాళ్ళే. తుర్వశుడి వంశం గురించి లక్ష్మయ్యగారు చెప్పిన వివరాలను ఈ గ్రంథంలో చదివి నేను ఆశ్చర్యపడ్డాను.తుర్వశుడి వంశం వాళ్ళే తురుష్కులు, మన తరకులు అంటాడు ఈయన. క్రూర కర్మలు చేస్తూ దేశ సంచారులుగా బ్రతకమని యయాతి శపించడంతో తురుష్కుల చరిత్రను పోల్చి చూచినపుడు లక్ష్మయ్యగారి పరిశోధన విలువ ఎంత గొప్పదో మనకు అవగతమవుతున్నది. చెంఘిస్‌ఖాన్ వంటి ప్రపంచ వీరులు మన భారతీయులే. యయాతి వంశీయులే అని అనుకొన్నప్పుడు పులకిగాత్రులు కాని భారతీయులు ఎవరుంటారు? ఈ మార్గంలో జరిగిన పరిశోధన ఎంత?

శర్మిష్ఠ కొడుకులలో తన ముసలితనాన్ని స్వీకరించి యయాతికి రాజ్యాధికార వారసుడుగా ఆయనచే ఆశీర్వాదం పొందిన పూరుని వంశంవాళ్ళే ఆ తర్వాతి దుష్యంతుడు, భరతుడు, శంతనుడు, కురుపాండవులు వగైరా. భరతుడి పేరు మీదనే ఈ దేశం భారతదేశం అయింది.

ఇంకా విశేషం ఏమంటే అరబ్బులు అరవలే అనడం. నేను నా "శివాలకలు" అనే కావ్యంలో ఆది అమెరికనులు తెలుగు వాళ్ళే అన్నాను. అమరిక అనే తెలుగు పదమే అమెరికా అయింది. అమెరికాలోని ఆది జనులు మయుడి (దానవశిల్పి) వంశం వాళ్ళే. మెక్సికో, పెరూ వంటి దేశాలను పరిపాలించినవాళ్ళు మనలాగే సూర్యారాధకులు. యిన (సూర్య) వంశీయులు, యిన్‌కాలు. జర్మనులను శర్మనులు అన్నారు లక్ష్మయ్యగారు. (The Hebrew Origin of the Indian Brahmin) (భారత బ్రాహ్మణుల హీబ్రూ జాతి మూలము) అనే గ్రంథంలో మధ్య ప్రాచ్యంలోని హీబ్రూ జాతులన్నీ భారతీయ వారసత్వంకలిగినట్టివే అనే విషయానికి లక్ష్మయ్యగారి పరిశోధనా ఫలితాలు నీరాజనం పడుతున్నవి.

ఈ వాస్తవాలన్నీ భారతీయ పురాణాలలోనూ ఇతర జాతుల ప్రాచీన సాహిత్యంలోనూ ఎక్కువగా దొరుకుతాయి. లక్ష్మయ్యగారు పరిమితమైన తన

పరిధిలో తాను సవ్యసాచిలా పనిచేస్తున్నాడు. ఈ కృషి, పరిశోధన బహుముఖంగా, బహుళంగా జరగవలసిఉంది. అలా జరిగినప్పుడే వాస్తవాలు బయటకు వస్తై.

సృష్టి ఎలా జరిగిందో, ఎలా విస్తరించిందో మత ప్రవక్తలు, విజ్ఞానులు ఎంతో మంది చెప్పారు. అన్ని ఊహలే. సైన్సు కూడా ఎంతో దూరం పోలేదు. ఆ విషయాలన్నిటిని కూడా అందినంత వరకు సేకరించి లక్ష్మయ్యగారు ఈ గ్రంథంలో పొందుపరిచారు. ఇదంతా ఒక ఎరుకకు, జ్ఞానానికి సంబంధించనటువంటిది. బిగ్ బాంగ్ సంఘటన వరకు సైన్సు ఊహించగలిగింది. అది ఎందుకు జరిగిందో తెలియదు కదా! ప్రశ్నలలో ఎందుకు? అనే ప్రశ్నకు జవాబు ఉండదు.

ఈ గ్రంథం ఎంత గొప్పదంటే, దానిలోని వస్తువును ఆధారంగా తీసుకొని ఎంతైనా వ్రాయవచ్చు. ఎన్ని ఊహలైనా చేయవచ్చు. ఎంత లోతుకైనా పరిశోధించ వచ్చు. విస్తృతి, గాఢత రెండూ ఉన్నాయి ఇందులో. ఇంతటి విలువైన రచనను చేసినందుకు, ఉన్నంతలో మనకు అందిస్తున్నందుకు లక్ష్మయ్యగారిని అనేక విధాలుగా అభినందిస్తున్నాను. సమస్త మానవ జాతులకు ఆది మన సరస్వతీ నదీ తీరమే అనే ఆయన ఉద్ఘాటనకు జోహారులు అర్పిస్తున్నాను.

ఇతోధిక ఆయురారోగ్య సమైశ్వర్య సిద్ధిరస్తు అని ఆయనకు నా ఆశీస్సులు అందజేస్తున్నాను.

ది. 21-06-1997

– మహాకవి, పద్మశ్రీ

బోయిభీమన్న

# పరిచయం

**డా॥ ఎం. కులశేఖరరావు**
రిటైర్డు తెలుగు హెడ్ డిపార్టుమెంట్
ఉస్మానియా విశ్వవిద్యాలయం.

మాన్యులు శ్రీ శెట్టి లక్ష్మయ్యగారు నాకు చిరకాలమిత్రులు. వారు జిజ్ఞాసువు. పరిశోధన చేసి లోకానికి క్రొత్త విషయాలు వెల్లడించాలని వారి ఆసక్తి. వారికి పరిపక్వమైన అనుభవం ఉన్నది. కొంత కాలం పూర్వం వారి పరిశోధనా దృష్టి చరిత్రపై ఉండేది. ముత్తరాజులను గురించి కారొక గ్రంథం కొన్ని సంవత్సరముల క్రిందట వ్రాసి ఉన్నారు. ఆ గ్రంథాన్ని పాఠకలోకం బాగా ఆదరించింది. ఈ ఆదరణ వారిని ప్రోత్సహించగా మళ్లీ వారి పరిశోధనాదృష్టి సృష్టి మూలము, విశ్వావిర్భావం అనే అంశం మీద పడింది. ఇక వారి పరిశోఅనలో వేదాలు, పురాణాలు, బైబిలు, ఖురాను, ఆధునిక శాస్త్ర గ్రంథాలు, ఒకటేమిటి అనేకానేక () ప్రవేశించాయి. వాటిని పరిశీలించి మనకీ గ్రంథాన్ని వారు అందిస్తున్నారు. దాని శ్రద్ధతో పఠించడం, దానిలోని సారాన్ని గ్రహించడం మనం చేయవలసిన పని.

మనం నివసిస్తున్న ప్రపంచం ఎట్లా వెలువడింది. ఈనాటి స్థితికి ఇది ఎట్లా చేరుకొన్నది అనే ప్రశ్నలు తరతరాలుగా, నిరంతరాయంగా మేధావులను ఎదిరిస్తైనే ఉన్నాయి. ఈ సృష్టి మూలాన్ని చూచిన వారు ఎవరూ లేరు. దాని ఆ విర్భావాన్ని గమనించినవారు లేరు. ఇది చరిత్రకు పూర్వాతి పూర్వయగంలో జరిగిన పరిణామం. ఇక దాన్ని గురించి అహోరాత్రంగా చెప్పడం తప్ప ప్రామాణికంగా నిరూపించడం సాధ్యంకానిపని. అనాదికాలంలో ఒక తేజో స్తంభం ఉండేదని, దాని నుండి ఈ ప్రపంచాన్ని బ్రహ్మ సృష్టించినాడని, దాన్ని కాపాడడానికి విష్ణు మూర్తిని విధించినాడని, సమయం వస్తే లయం చేసే పనిని మహేశ్వరుడికి అప్పగించినాడని మన పురాణ మాజ్మయం చెబుతూ ఉన్నది. ఇది దైవికమైన స్థితి. ఈశ్వరుని మీద విశ్వాసం ఉన్నవారికి ఈ సిద్ధాంతం నచ్చుతుంది. లేనివారికి బ్రహ్మ విష్ణు మహేశ్వరులు లేనే లేరు. విశ్వసృష్టి ఇది కాదు. భారతీయుల్లో చాలామంది ఆస్తికులే కాబట్టి వారందరు ఈ విషయాన్ని విశ్వసిస్తారు.

కొన్ని లక్షల సంవత్సరాల క్రిందట విశ్వంలో ఉండే మౌలిక వస్తువుల కలయిక జరిగిందని, ఇది ఒక పెద్ద విస్ఫోటనంతో ప్రారంభమైందని, దాని తరువాత విశ్వం ఏర్పడిందని శాస్త్రజ్ఞులు కొంత కాలంగా ఊహించి చెబుతున్నారు. దాని బిగ్ బ్యాంగ్ అంటారు. ఇది ఎప్పుడు జరిగిందో, ఎందుకు జరిగిందో సకారణంగా చెప్పిన వారు లేనే లేరు. ఒక విధంగా పృధ్వి, అగ్ని, తేజస్సు, వాయువు, ఆకాశము అనే పంచ భూతాల సమ్మేళనం జరిగిందా? అని మనం ఊహించ వచ్చు. అది సృష్టికి మూలమై ఉండవచ్చు.

బైబిలు గ్రంథంలో ఈశ్వరుడు సర్వప్రాణులను జంటలుగా సృష్టించినాడని, అదే సృష్టికి మూలమని చెప్పబడింది. క్రైస్తవ మతానుయాయులు విశ్వసిస్తారు. ఈశ్వరుడు ఆరు రోజులు సృష్టి నిర్మాణం చేసినాడని, ఏడవ రోజు విశ్రాంతి తీసుకొన్నాడని వారి విశ్వాసం. మనుష్యుడు మరణించిన తరువాత ఎక్కడికి వెళ్లుతాడు? అని ప్రశ్న వేసుకొని దానికి సమాధానాలు చెప్పినట్లుగానే, విశ్వసృష్టిని గురించి అనేకానేక విషయాలు చెప్పవచ్చు. అనేకులు చెప్పినారు కూడ. శ్రీ శెట్టి లక్ష్మయ్యగారు, ఎవరు ఏమి అనుకొన్నారో వాటిని సేకరించి ఆసక్తికరంగా ఈ గ్రంథంలో చేర్చినారు. సృష్టి ఏర్పడి ఎంతకాలమైందో కూడ వారు చర్చ చేసినారు. శ్రీ లక్ష్మయ్యగారి ఆసక్తిని మనం గమనించవలసిందే. ఈ గ్రంథాన్ని చదివే వారికి కూడ ఈ విషయం మీద ఆసక్తి కలిగితే వారి పరిశ్రమఫలించినట్లే - తథస్తు.

ఎం. కుల శేఖరరావు.

డా॥ ఎస్. జి. రామానుజాచార్యులు తేది 28-6-97.
ఎం.ఏ. పి.హెచ్.డి.
వైస్ ప్రిన్సిపాల్, ప్రభుత్వ ఆంధ్ర ఓరియంటల్ కాలేజి
నల్లకుంట - హైద్రాబాదు - 500 013.

# వివరణ

సృష్టి మూలాన్ని గూర్చిన చర్చ మనవాళ్ళు అనాదిగా చేస్తూనే ఉన్నారు. మన వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, ఇతిహాసాలు అన్నీ సృష్టి తత్వాన్ని గూర్చి భగవత్తత్వాన్ని గూర్చి విస్తృతంగా చర్చించాయి.

శ్రీ శెట్టి లక్ష్మయ్యగారి రచన "సృష్టి మూలము - విశ్వావిర్భావము" కూడ సృష్టిని గూర్చి చర్చించిన గ్రంథము.

ముత్తరాజుల చరిత్ర రచనలో చరిత్రలోని లోతుపాతులను క్షుణ్ణంగా చర్చించిన శ్రీ లక్ష్మయ్యగారు విశ్వసృష్టిని గూర్చి చర్చించే ప్రయత్నం చేయడం ముదావహమైన అంశం.

పదకొండవ ప్రకరణములో అధ్యాయములలో సృష్టి గహస్యాలను వివరించుటకు శెట్టి లక్ష్మయ్యగారు ప్రయత్నించారు.

మొదటి ప్రకరణములో ఆత్మ - పరమాత్మ ఒకటే అనే తాత్వికుల అభిప్రాయాలను దైనందిన జీవితములోని అంశాలను జోడించి సమర్థించుటకు శ్రీ లక్ష్మయ్యగారు ప్రయత్నించారు.

అలాగే రెండవ ప్రకరణములో బైబిల్-ఖురాన్ మత గ్రంథాలనాధరించిన సృష్టి విషయాలపై చర్చ కొనసాగించి వాటిలో అభిప్రాయైన్యతను వివరించారు.

మూడవ ప్రకరణములో ఐతరేయ బ్రాహ్మణము, బృహోదారణ్యకోపనిషత్తు, మనుస్మృతి పాతంజలి యోగదర్శనీము, ముండకోపనిషత్తు, తైత్తిరీయోపనిషత్తు మున్నగు వైదిక వాఙ్మయగ్రంథములనాధరించి సృష్టి స్వరూపము నిర్వచించుటకు ప్రయత్నము జరిగినది.

నాల్గవ ప్రకరణములో న్యాయవైశేషికదర్శనముల అధునిక శాస్త్రజ్ఞుల

అభిప్రాయాలను దృష్టిలో పెట్టుకొని సృష్టి క్రమాన్ని సమన్వించే ప్రయత్నం జరిగినది.

ఐదవ ప్రకరణములో సృష్టి పూర్వ పరిస్థితిని గూర్చి సృష్ట్యనంతర పరిస్థితిని గూర్చి సుదీర్ఘమైన చర్చకలదు. పంచభూతాలు సైతంలేని సృష్టి పూర్వదశ, అనేక నక్షత్రాలు, సూర్య చంద్ర శుక్రాది గోళాలు గల సృష్ట్యనంతరదశ కూడ సోదాహరణగా నిరూపించబడినది. ఈ ప్రకరణములో ఆత్మ పరమాత్మ చర్చతో పాటు ద్వైత, అద్వైత, విశిష్టాద్వైతాది వైదిక మత సిద్ధాంత విమర్శ కూడ కలదు. విశ్వావిర్భావాని కొలిచే కాలమాణాల చర్చ కూడ ఈ ప్రకరణములో కొనసాగినది.

ఆరవ ప్రకరణములో మానవసృష్టి అనంతరమువారి ఉత్పత్తి, వికాసాల చర్చ చేయబడినది. హిమాలయ ప్రాంతములో మానవుని ఉనికి ఏర్పడినదిని, హిమాలయమునందలి మానవ సరోవర ప్రాంతమునందే మనుష్య జన్మ ప్రారంభమైనదని ఆర్యులు నివసించుటచే ఈ దేశం ఆర్యావర్తమైనదనీ, భరతుడు రాజ్యమేలినందువల్ల తర్వాత దీనిని భారతదేశమన్నారని లక్ష్మయ్యగారు యుక్తి యుక్తముగా చక్కగా వివరించారు.

ఏడవ ప్రకరణములో జీవజాతుల సుదీర్ఘ పరిణామము.

ఎనిమిదవ ప్రకరణములో రామాయణ, మహాభారత, ఉపనిషత్తులలోని మానలో ఉనికి, భారతదేశంలోని, శైవ, వైష్ణవ, శాక్తేయాది మతముల పరిచయము మున్నగు అంశాలు వివరింపబడినవి.

తొమ్మిదవ ప్రకరణములో ఆత్మ-అనాత్మ-పరమాత్మలను గూర్చిన విచారము చేయబడినది.

శ్రీమణ్నారయణమహాదేవాది పదముల అర్థ సమన్వయము, సూర్యచంద్రాది నవగ్రహాల స్వరూపము జన్మాష్టమి, మహాశివరాత్రి, మహా వంతే పర్వదినాల ప్రాముఖ్యము మున్నడు అంశాలు చర్చింపబడినది.

ఈ పద్ధతిలో నవప్రకరణాలలో వివిధ ఎన్నో కోణాలతో సృష్టి, దానికి అనుబంధించిన ఇతర అంశాలను శ్రీ లక్ష్మయ్యగారు స్థూలంగా చర్చించితమ ఉపజ్ఞను నిరూపించుకొన్నారు. సృష్టి జిజ్ఞాసువులైన వారికి వీరి గ్రంథం ఎక్కువగా ఉపకరిస్తుందని విశ్వసిస్తూ సృష్టి రహస్యాలను అందరికి అందింపజూచిన శ్రీ లక్ష్మయ్యగార్కి అస్రష్ట ఆయురారోగ్యాలను ప్రసాదించాలనీ ఆశిస్తున్నా.

డా॥ ఆర్. శ్రీహరి

తెలుగు ప్రా॥ మరియు హెడ్ డిపార్టుమెంట్
హైదరాబాదు విశ్వవిద్యాలయం
కేంద్ర విశ్వవిద్యాలయం పోస్టు, హైదరాబాదు - 500 046.

# శుభాకాంక్షలు

శ్రీ లక్ష్మయ్యగారు రచించిన ' సృష్టి మూలం - విశ్వావిర్భావం'' అన్న గ్రంథాన్ని చూచినాను. ఇందులో వారు సృష్టి ఏర్పడిన వాధానాన్ని, సృష్టికి గల మూలాన్ని చక్కగా నిరూపించినారు.

భారతీయులకు వేదాలు, ఉపనిషత్తులు, దర్శనాలు, ఇతిహాస పురాణాలు ప్రామాణికగ్రంథాలు. ప్రాచీన భారతీయ విజ్ఞానమంతా వీటిలో నిక్షిప్తమై ఉంది. లక్ష్మయ్యగారు ఈ వాఙ్మయంతో బాగా పరిచయమున్నవారు కావడంచేత ఈ వాఙ్మయం ఆధారంగా సృష్టి ఏర్పడిన విధానాన్ని, సృష్టికి గల మూలాన్ని ఈ గ్రంథంలో సప్రమాణంగా వివరించినారు. సృష్టి ఉత్పత్తి మొదలైన అంశాలపై ఆధునిక విజ్ఞాన శాస్త్రవేత్తలు కూడా ఎన్నో పరిశోధనలు చేసి అనేక నూత్న సిద్ధాంతాలను ప్రతిపాదించినారు. ప్రతిపాదిస్తున్నారు. రచయిత ఈ సిద్ధాంతాలను కూడా వివరిస్తూ విషయ ప్రతిపాదన చేయడం వారి ప్రచీనాధునిక సిద్ధాంత సమన్వయానికీ, నిష్పక్షపాత దృష్టికీ తార్కాణం.

ఆధునికకాలంలో వేదాదిప్రాచీన వాఙ్మయంలో ఉన్న ఈ విధమైన విషయాలపై ఆలోచించేవారిని, శ్రమించేవారిని వేళ్ళ మీద లెక్కించవచ్చు. అట్టివారిలో లక్ష్మయ్యగారొకరు. ఆధునిక కాలంలో వేదాది ప్రాచీనవాఙ్మయంలో ఉన్న ఈ విధమైన విషయాలపైఆలోచించేవారిని వేళ్ళమీద లెక్కించవచ్చు. అట్టివారిలో శ్రీ లక్ష్మయ్యగాను ఒకరు.

వీరివిధంగానే ప్రాచీనవేదవాఙ్మయాన్ని పరిశీలించి అనేక నూతనాంశాలను ప్రతిపాదించాలనీ, భగవంతుడు వారికా శక్తియుక్తులను ప్రసాదించాలని కోరుకుంటున్నాను.

ఈగ్రంథాన్ని రచించిన శ్రీ లక్ష్మయ్యగారికి నా హార్దిక శుభాకాంక్షలు.

31-8-97

రవ్వా శ్రీహరి

సృష్టిమూలం - విశ్వావిర్భావం అను గ్రంథమునకు అచ్చువేయుటకు ధన సహాయము చేసి, సహకరించినవారికి నా హృదయ పూర్వక ధన్యవాములు. ఈక్రింద నుదహరించిన దాతల పేర్లు చూపించు చున్నాము –

| | | | | |
|---|---|---|---|---|
| 1) | మాత శ్రీశ్రీశ్రీ మానీకేశ్వరీ | - | యానెగొంచి | రూ - 101-00 |
| 2) | శ్రీ పాముల కుమారస్వామి | - | - | రూ - 1116-00 |
| 3) | శ్రీ గాడేపల్లి శంకరయ్య | - | - | రూ - 1116-00 |
| 4) | శ్రీ కోడూరి అనంతకుమార్ | - | | |
| | 16 రీముల కాగితము యిచ్చినారు | | - | రూ - 4500-00 |
| 5) | శ్రీ ఇ. అర్జున్ కుమార్ | - | చిక్కడపల్లి | రూ - 1116-00 |
| 6) | శ్రీ కాశబోయిన దామోదర్ | - | - | రూ - 1000-00 |
| 7) | శ్రీ పిట్టల హనుమంత రావు | - | - | రూ - 1000-00 |
| 8) | శ్రీ బల్లిగురు చణం | - | - | రూ - 1016-00 |
| 9) | శ్రీ కోటి శ్రీనివాసరావు | - | - | రూ - 1000-00 |
| 10) | శ్రీ కె.. నాగేందర్ | - | నెల్లూరు | రూ - 1000-00 |
| 11) | శ్రీ రావుల నాగేశ్వర్ రావు | - | - | రూ - 500-00 |
| 12) | శ్రీ క్రిష్ణ స్వామి | - | సెబాస్టియన్ రోడ్డు | రూ - 500-00 |
| 13) | శ్రీ ల్యాగల వెంకట రాజులు | - | - | రూ - 500-00 |
| 14) | శ్రీ గోపిశెట్టి రాజేశ్వరరావు | - | - | రూ - 500-00 |
| 15) | శ్రీ సాయిని ఆగమయ్య | - | - | రూ - 500-00 |
| 16) | శ్రీ కె. వరదరాజులు | - | - | రూ - 100-00 |
| 17) | శ్రీ సేరి ఇంద్రసేనా రెడ్డి | - | - | రూ - |
| 18) | శ్రీ కె. వెంకట రాజు | - | - | రూ - |
| 19) | శ్రీ భాస్కర రెడ్డి | - | - | రూ - |

# విషయసూచిక

## సృష్టి మూలము - విశ్వావిర్భావము


పుట. నెం.

1. వ ప్రకరణము : సృష్టిమూలము - విశ్వావిర్భావము కన్న పూర్వము 1-7

2. వ ప్రకరణము : బైబిల్‌లోని అంశములు సృష్టికన్న పూర్వము 8-18

3. వ ప్రకరణము : ఉపనిషత్తుల నుండి సృష్టి మూలము - డార్విన్ పరిణామము. 11-18

4. వ ప్రకరణము : వైశేషిక దర్శనము - కణాది మహర్షి ప్రతీతము మరియు సైంటిస్టుల - యొక్క చూపిన వివరములు - సృష్టి మూలము. 19-35

5. వ ప్రకరణము : సృష్టి ఉద్భవము యొక్క నిజ రూపము. 35-55

6. వ ప్రకరణము : మానవుని జన్మస్థానము భారత దేశ పూర్వ వైశాల్యము. 56-61

7. వ ప్రకరణము : జీవజాతుల సుదీర్ఘ పరిణామం 61-64

8. వ ప్రకరణము : వివాహిత్ - ఆనంద్ - సంతానము యొక్క పుట్టుక వివరము. 65-70

9. వ ప్రకరణము : ఆత్మ - అనాత్మ - పరమాత్మ. 71 -73

10. వ ప్రకరణము : ఆత్మ - ఆనాత్మ - పరమాత్మ - శబ్దార్థములు 74 -77

11. వ ప్రకరణము : ఆత్మ - జీవాత్మ - పరమాత్మ మరియు ముగింపు 78-87

ఓం

# సృష్టి మూలము విశ్వావిర్భావము

1 ఓం అగ్నిమిళే పురోహితం - యజ్ఞస్య దేవవృత్విజమ్ హోతారం - రత్న ధాతమమ్ ( ఋగ్వే. మం.)

2 ఓం హిరణ్య గర్భ : సమవర్త తాగ్రే - భూత స్య జాతః పతీరేక ఆసిత్ సదాధార పృధివీం - ద్యామె తేమాం - కస్మై దేవాయ హ విశావి దేమః (ఋగ్వే. మం10 - సూ 121 -మం .)

## 1.వ ప్రకరణము 1.వ అధ్యాయము :

సృష్టి మూలము - విశ్వవిర్భావము - సృష్టి అన్ననేమి, సృష్టి ఎట్లు ఏర్పడినది. సృష్టికి పూర్వము ఏమియుండెను, సృష్ట్యాది ఏమి ఏమి ఏర్పడినవి, అవి ఏమిటి, వాటిని ఏమని పిలుస్తారు, సృష్టి ఏర్పడి ఎన్ని సంవత్సరములు యైనది. మరియు ఈ సృష్టిని వెలి తీసిన విజ్ఞానమును గురించి (సైంటిస్టులు) శాస్త్రజ్ఞులు విజ్ఞాన వంతులు మరియు మతాధిపతులు, దేవి భాగవతము, భారతము మరియు వేద మంత్రములు మనుస్మృతి ఉపనిషత్తుల నుండి ఏమని అభిప్రాయము గ్రహించిన విషయములు ఇందు చూపబడుచున్నవి. -

1. సృష్టి. - అనగా లేని దానిని సృష్టించుట. అది సప్రమాణముగా నిరూపింపబడినది. లేక కొత్తరూపమును రూపొందించుటకు కూడా అని తెలియును. సృష్టికి ముందు శూన్యముగా ఉండెనని శాస్త్రజ్ఞులు, విజ్ఞాన వంతులతోపాటు, మత గ్రంథములు భాగవతమును, భారతము ఉపనిషత్తులు మరియు వేదమంత్రములు కూడా దీనినే ధృవపరుచు చున్నవి. అనగా పృథ్వి, అగ్ని, జలము, వాయువు కూడ లేని కాలము, మరి ప్రకృతి అసలె లేనట్లు కనపడుచున్నది కదా మరియు ఏ రూపముతో సృష్టి ఏర్పడినది ? దానికి కారణము ఏమి అది కార్య రూపముగా ఎట్లు దాల్చినది ? ఆధ్యాత్మ విధులు, ఫిలాసఫర్లు, ( జ్ఞానులైన వారు ఆత్మశక్తిని గూర్చి ప్రవచించిన అభిప్రాయాలే దేవి భాగవతంలో కనిపిస్తాయి. శాస్త్ర విజ్ఞానములో గల అభిప్రాయాలు మాత్రము

ఇందుకు భిన్నముగా గోచరిస్తాయి. వివిధ మతగ్రంథాలను గమనించినప్పుడు భూమి పుట్టినప్పటి నుండియు మానవుని చరిత్రకే అధిక ప్రాధాన్యత ఇచ్చినట్లు కనపడుచున్నది. కాని మానవుడు జన్మించక పూర్వమే, భూమి - జలం - వాయువు అగ్ని ఉన్నట్లు చూపడం జరిగినది.

మానవుడు జన్మించిన తర్వాత అగ్నిని చూడలేదు. భూమిపై వెలసిన ప్రకృతి, ఔషధ సంపదను మాత్రమే చూడగల్గినాడు. దాని ఆధారంతో అనగా పండ్లు, ఫలములు తిని పశువులు పాలు త్రాగుట వాటితోపాటు జీవించుట వారికి దినచర్యగాను, అమితముగా సుఖముగా కొన్ని వందల సంవత్సరముల వరకు బ్రతికియున్నారు. తరువాత ఆ కాలము ఏర్పడినది. వర్షము లేదు, నీరు లేదు, చెట్లు ఎండిపోయి విరిగిపడుట, విరిగిపడినప్పుడు చెట్టుకు చెట్టు తగిలి (రాసుకొని) ఒరిపిడి వలన అగ్ని ఉద్భవించినది. అరణ్యమంతయు అగ్నికి ఆహుతైనది.

పశువులు, జంతువులు, ఇతర పక్షులు, ప్రాణ కోటి జీవులు చనిపోయినవి.. మానవుడు ఆకలి మంటలకు ఆగలేక అప్పటికి బ్రతికి యున్న కొన్ని సాధు జంతువులను అనగా మేకలు, చిన్న చిన్న జంతువులను పక్షులను అగ్నిలో పడవేసి కాల్చి తినుచుండెను. ఆ విధముగా మానవుడు ఇదియే ఆధారము అనుకోలేదు.. తరువాత మళ్లీ వర్ష ఋతుగ్రణాలు ఏర్పడి, వర్షములు కురియుటచే నీళ్ళు భూమిపై నిలుపుట వలన వరి ధాన్యమును కొళ్లు కొట్టుకొని జీవన ఆధారమును చేసుకొనెను. తర్వాత ఇంద్రియ ప్రేరితుడై ఆదిమానవుడు తనకు కావలసిన పనిముట్లను, రాళ్లతో చేసుకొని ఉపయోగించెను. ఈ విధముగా ఆదిమానవుల చరిత్రను మనము గుర్తించాము.

మానవుడు ఈనాడు ఎంతో విజ్ఞానంను పొంది యంత్రాంగము ద్వారా అనగా ఉపగ్రహము ద్వారా చంద్ర మండలము పోయి రాగల్గుచున్నాడు. ఇంక ఇతర మండలములకు పోవుటకు కూడా ప్రయత్నము చేయుచున్నాడు. ఇదియునుగాక భూమిలోని పదార్థములను భూమిపై యున్న ఔషధములు మరియు నీరు - వర్షభావములను సైతము (శాటిలైట్) (ఫోటో) ఛాయతో సహా గుర్తించుచున్నాడు.

ఇక పూర్వము మానవులు అనగా ఋష్యాదులు, మహాత్ములు, కూడా ఇతర గ్రహాల సమాచారమును తమ ఆత్మ శక్తి (విల్‌పవర్) చేత తెలుసుకొనగల్గినారు. వాటిని గురించి చెప్పడము గూడ జరిగినది. అదియే వేదములలోను, ఉపనిషత్తులలోను, కనబడుచున్నది. ఇందులకు నా స్వప్న వృత్తాంతమిలా ఉన్నది.

అమెరికా నుండి వ్యోమగాములు ఉపగ్రహము ద్వారా చంద్ర మండలము వెళ్లి వచ్చిన ' ఆర్మ్‌స్ట్రాంగ్' మరి ఇద్దరు వ్యక్తులు తిరిగి భూమిపై వచ్చిన నాటి రాత్రి నాకు ఒక కలపడినది. నా మిత్రుడు ( ప్లేన్) వాయు యానము తీసుకొని నా ఇంటి ముందు నిలిపి చంద్ర మండలమునకు పోవుటకు నిన్ను రమ్మని అన్నారు. 'రా' అని పిలుపు యిచ్చినట్లుగా వినబడినది. నేను దానికి జవాబు 'నేను వెళ్లి వచ్చినాను' అనగా నేను చంద్రమండలమునకు వెళ్లివచ్చినాను అని చెప్పుట, రెండుసార్లు మాటలు జరిగినవి. అంతలో నా భార్య నన్ను తట్టినది మెలుకవ వచ్చినది, ఆ సమయము శుషుప్త సమయము, అందువల్ల జ్ఞాపకము యున్నది. ఇది చదువరులు తెలుసుకోగలరు.

దీని వలన మనుష్యులెందరో వేరైనా, వారి ఆత్మ ఒకటే అనే తాత్త్వికుల సిద్ధాంతము బల పడుచున్నది. ఆర్మ్‌స్ట్రాంగ్ వంటి వారు చంద్ర మండల యానము చేస్తే, దాని అనుభూతి నా వంటి వారికి స్వప్నంలో కనబడుట పై విషయమును ధృవ పరచుచున్నది. మానవుడు ప్రస్తుత సమయమున విజ్ఞానమును పొంది 'అణు - పరమాణువుల' గురించి తెలుసుకొనుచున్నాడు, కాని అది సృష్టి రహస్యమును మాత్రము తెలుసుకోలేక పోవుచున్నాడు.

ఈ అణు విషయమును చర్చించు దశలో అది సృష్టి యొక్క వివరమును మీ ముందు పెట్టగలము (సైన్సు) విజ్ఞానము ఆత్మ శక్తి (విల్ పవర్) గురించి విచారించవలసియున్నది. ఇప్పుడు మన పూర్వులైన యుగపురుషులు చూపిన ఆది సృష్టి వివరాలను విచారించెదము.

## 2. అధ్యాయము :-

2) (ఆ) మంత్రము : - ఓం తమ ఆసీత్తమాసాగూఢమగ్రే - ప్రకేతం సలిలం సర్వమా ఇదం.

తుచ్ఛ్యేనాభ్వపీవాదం - యాదాసీత్త పసస్తన్మజానా హియత్తైకమ్,

( ఋగ్వేదము మం॥ 0 సూ 129- 8 వ సముల్లాస.)

( ము - సత్యార్థప్రకాశము - పుట 271. - )

తా : ఈ జగతంతయు సృష్టికి పూర్వము అంధకారముచే విక్రుతమై - రాత్రి రూపమున (చీకటి) తెలియుటకు యోగ్యమై, ఆకాశరూపమున జగమంతయు తుచ్ఛమై, అనంత పరమేశ్వరుని యెదుట నొక ప్రదేశముందా చ్ఛాదితమై యుండెను. పిమ్మట పరమేశ్వరుడు తన సామర్థ్యముచే కారణ రూపము నుండి కార్యరూపము చేసెను.

(అ) మంత్రము - ఓం హిరణ్యగర్భ సమవర్తతా గ్రే - భూతస్యజాతః పతిరేక ఆసీత్, సదాధారపృధీవీం - ద్యాముతేమాం - కస్మైదేవాయ అవిషా విదేమః ॥ -

ఋగ్వేదము - మం- 10 - సూ(2) మ.11. -)

తాః సమస్త సూర్యాది తేజః పదార్థములకు నాధారము, కాగల జగత్తునకు అద్వితీయపతి ఈ జగదుత్పత్తికి పూర్వము - విద్యామాన్యుడు, పృధివి మొదలుకొని సూర్య పర్యంత జగత్తును త్పన్నము చేసిన వాడగు ఆ దేవుడు అట్టి పరమాత్మను ప్రేమతో సేవింపుడు.

(ఇ) మంత్రం : - ఓం పురుష ఎవేదగం - సర్వం యాద్భూతం యచ్ఛభావ్యం,

ఉతామృతత్వస్యే - శానోయదన్నే నాతిరోహతిః ॥ - (యజుర్వే. మం. అ. 31. మ.2)

తాః అన్నిటియందు నిండియున్న పూర్వపురుషుడు, నాశరహితుడు, కారణమునకును జీవమునకును స్వామి పృధివ్యాధి జడమూలకంటేను, జీవుని కంటెను, ఆతిరుక్తుండునకు ఆ పురుషుడే యీ సమస్త భూతభవిష్యత్వేరమానష్ఠ జగత్తుల చేయువాడు. -

(ఈ) మంత్రం :- ఓం యతోవా ఇమాని భూతాని - జాయంతే యేన

జాతిని జీవంతి, యత్ప్రయంత్యభి సంవిశంతి - తద్విజి జ్ఞాసస్వతద్బ్రహ ) ॥ -

తాః ఏ పరమాత్మ రచన చేత ఈ సమస్త పృధివ్యాది, భూతములు త్పన్నములగు చున్నవో

ఏవనిచే జీవనమును, ఏవనియందు ప్రళయమును బొందుచున్నదో, అతడే బ్రహ్మము

అతనిని తెలియుటకు నిచ్ఛగింపుము తెలుసుకొనుము. -

(ఉ) .సూత్రం :- ఓం జన్మాద్యస్యయతః ॥ (శారీరక.।సూ. అ.।.పా.।. సూ.2).-

తా: ఎవనిచే నీజగత్తుత్పస్థితి - ప్రళయములగుచున్నవో, ఆ బ్రహ్మయే తెలియుటకు యోగ్యుడు. (సత్యార్థప్రకారము (పుట.271.272).-

(ఊ) మంత్రము :- హిరణ్యగర్భుడు - (జ్యోతిర్వై హిరణ్యం - తెజోవైవారణ్య - మిత్యైతరేయె

శత పథేచ బ్రహ్మణే - యో హిరణ్యానాం - సూర్యదీనాం - తేజసాం, గర్భ ఉత్పత్తి మిత్తమధి కరణం - సహిరణ్యగర్భః ).-

తాః - ఆతనియందు సూర్యాది తేజోవంతములగు లోకములు ఉత్పన్నములై అతనియాధీనమందుండును, లేక అతడు సూర్యాది తేజస్వరూప పదార్థము ఆగర్భము, అనగా ఉత్పత్తి స్థానము నివాసస్థానము, గనుక నా పరమేశ్వరునకు హిరణ్యగర్భుడనే పేరు, ఇందులకు ఈ యజుర్వేద మంత్రము ప్రమాణం. -

(ఋ) మంత్రం : హిరణ్యగర్భః సమవర్త తాగ్రే భూతస్యజాతః పతిరేక ఆసీత్.

సదాధారపృధివీం ద్యాము తేమాం - కస్మై దేవాయు ఆ విషావిధేమ ॥ -

ఋగ్వేదము.మం.10. సూ.12 మం. ॥. పుట 15.)

తాః ప్రపంచమందు రెండు పదార్థములు గలవు. ( ఒకటి కారణము - రెండవది

కార్యము) ఏది కారణమో యది కార్యము కాదు, కార్యమై యున్నప్పుడది - కారణము కాదు. మనుష్యుడు, సృష్టిని ఉన్నదున్నట్లు తెలిసకొననంత వరకు నతనికి సరియైన జ్ఞానము కలుగజాలదు. -

3. వ అధ్యాయము :-

(3) స్వర్గీయ పండిత రఘునందన శర్మగారు తమ వైదిక సంపత్తిలో పై విషయమునేగాక ఇతర మతముల వారి గ్రంథముల నుండి చూపిన సృష్టి విషయములను ఈ విధముగా తెలిపియున్నారు. (తెలుపనైనది)

(అ) శ్రీ మ్యాక్స్‌మూలర్ గారి విచారము. - సృష్టి లేక మనుష్యుడు, మధ్య ఏషియా ప్రాంతములో మానవుని సృష్టి అయినదని చెప్పెను. వీరి అభిప్రాయము అంతగా నమ్మదగినదిగా లేదు (అప్పటికి ఆఫ్రికా, అరబ్, ఇరా ంటి దేశములు ఏర్పడినట్లు కనపడలేదు. తర్వాత కొంత మంది ఆర్యులు మధ్య ఏషియాలలో నివసించుటచే వారి జన్మస్థానము, మధ్య ఏషియా అని చెప్పుట కల్గినది ) (స్వంత).

(ఆ) శ్రీ బాబు ఉమేశ్‌చంద్ర విద్యారత్న, బెంగాలీ యొక్క సుప్రసిద్ధ పండితులు వారు 'మాన్‌వేర్' అనగా మనుషుని యొక్క జన్మభూమి పేరుగల ఒక గొప్ప గ్రంథము వ్రాసిరి. అందులో మనుష్యుని జన్మభూమిని గురించి, మంగోలియా దేశమని చూపినారు. కాని ఈ వాక్యము గురించి ఎక్కడ ప్రమాణము చూపలేదు. మనుష్యుని యొక్క సృష్టి మాంగోలియాలో జరిగినది. ''(కాని పై చూపిన మాన్‌వేర్ అనే పదమునకు 'మాన్ సరోవర్'' అయి ఉండవలెను. ఏదైన ఊహించినదే కానిచో సాప పత్తికముగా నిరూపించ బడలేదు''. (స్వంత)

(ఇ) స్వామి ఋషి దయానంద సరస్వతిగారు మనుష్యుని సృష్టి త్రివిష్టప్రం - అనగా టిబ్బత్‌లోనే జరిగినది అని చూపినారు కాని ప్రమాణము లేదు.

(ఈ) భారతీయ సనాతన ధార్మికులు.- ఆర్యులు భారతదేశంలోని

కురుక్షేత్రమును, ముఖ్య స్థానముగా చూపినారు. కాని శత పథ బ్రాహ్మణులలో చూపిన దానికి దీనికి పొంతన లేదు. ఋషులు జన్మించి కురుక్షేత్రమునకు వచ్చి నివసించుట, తర్వాత వ్యాధిగ్రస్తులైతే తిరిగి హిమాలయ పర్వతంలో తమ పూర్వ నివాసంనకు జేరుకొనేవారని ఉన్నాది. ఇది మనుష్యుని స్థితిపై ఈ విధముగా జర్చ జరుగుతు వచ్చుచున్నది.

(ఉ) బైబిల్ - ఇసాయిలు, మరి మహమ్మదీయులు '.బాగ్ అదన్' అనే స్థానంను, మూలస్థానంగా భావించుతారు. లేక నమ్ముతారు. మానవసృష్టి 'అదన్'శబ్దము (అదీమ్) అనగా సంస్కృతమందు ' ఆదీమ్' శబ్దము యొక్క అపభ్రంశమైతే రెండు శబ్దముల యొక్క తాత్పర్యము ' ఆదీమ్' స్థానమని చూపబడుచున్నది. కాని బైబిల్ యొక్క వాక్యము విరుద్ధముగా వచ్చుచున్నది. కాని ఈ సిద్ధాంతము అంత ఉచితముగా కనపడలేదు. (వైదికి సంపతి .పుట. 162 - 163). ( ఇక్కడ అదీమ్ అనగా ఆధం అని కూడా భావించవలయును ఆధం మొట్టమొదటి భగవంతుడు సృష్టించిన మనిషి (ఈవిధముగా పెక్కురు తాత్త్వికుల, మత గ్రంథముల ఆధారంగా మానవుని స్థితిగతులను గూర్చి ఆలోచించినను తెలిసిన విషయాలు అతి స్వల్పము. ఒక్కమాటలో చెప్పాలంటే ఆదిమానవుని ఉనికి విషయములో ఆలోచనలకు ఆలోచనలు ఇంకా ఒకదరికి చేరలేదని చెప్పాలి. -

**2.వ ప్రకరణము 1.వ అధ్యాయము :-**

**బైబిల్‌లోని కొన్ని అంశములు . - సృష్టిమూలము - డార్విన్ పరిణామము :-**

ఆది యందు దేవుడు భూమి, ఆకాశమును సృజించెను. భూమి, నిరాకారముగా, శూన్యముగా ఉండెను. చీకటి అగధా జలములపై కమ్మి యుండెను. దేవుని ఆత్మ జలములపై అల్లాడుచుండెను. వెలుగు కమ్మని దేవుడు పలుకగ - వెలుగు కలిగెను - వెలుగును - చీకటిని దేవుడు వేరుపరిచెను. వెలుగునకు - పగలనియు - చీకటిని రాత్రి యనియు పేరుపెట్టెను. అస్తమయము - ఉదయము కలుగగా ఒక దినమాయెను.

జలముల మధ్య ఒక విశాలము కల్గి ఆ జలములను - ఈ జలములను వేరు పరచుగాక అని దేవుడు పలికెను. విశాలము క్రింద జలమును విశాలము - మీది జలములను వేరు పరచగా అప్రకారమయెను, దేవుడు ఆ విశాలమునకు ఆకాశము అని పేరు పెట్టెను. ఆకాశము క్రింద ఉన్న జలములు ఒకచోట కూర్చబడి, అది నేల కనపడుగాక, అని దేవుడు పలుకగా ఆ ప్రకారమాయెను. భూమి వాటిని మొలిపింపగా రాత్రి - పగళ్ళను వేరు పరచునట్లు, ఆకాశములో జ్యోతులు కలుగుగాక అనియు, అవి కాలమును సూచించుటకు ఉండుగాక అనియు దేవుడు పలికెను. ఆ ప్రకారమాయెను. -

సముద్రము, చేపలు, ఆకాశపక్షులు కలుగుగాక అని దేవుడు పలికెను. అది మంచిదని దేవుడు చూచి మీరు అభివృద్ధి చెంది సముద్ర జలములలో నిండియుండుననియు, పక్షులు భూమిపై విస్తరించు గాక యనియు దేవుడు ఆశీర్వదించెను.

బైబిల్‌లోని మానవసృష్టి ఆయా జాతి ప్రకారము పశువులను, పురుషులను, అడవి జంతువులను భూమి పుట్టించుగాక అని దేవుడు పలికెను. ఆ ప్రకారమాయెను. అది మంచిదని దేవుడు చూచెను. దేవుడు తన స్వరూప మందు 'నరుని సృజించెను' స్త్రీ పురుషులుగా వారిని సృజించెను. దేవుడు ఆశీర్వదించెను.

**( డార్విన్ పరిణామము పుట.16.)**

బైబిల్ పాతనిబంధనలో దేవుడైన యోహోవా నేల మట్టితో నరుని నిర్మించి వాని ముక్కు రంధ్రంలో జీవ వాయువును ఊదగా, నరుడు జీవాత్మ అయేను **(పాతనిబంధన 2 అధ్యాయము 8)**

ఆదామునకు దేవుడు గాఢ నిద్ర కలుగుజేసి ఆ సమయములో అతని ఎడమ ప్రక్క ఎముక ఒకదానిని తీసి ఆ చోటున మాంసంతో పూడ్చి వేసెను. ఆ ఎముకను స్త్రీగా నిర్మించి, ఆమెను అదాము వద్దకు తీసుకొని వచ్చెను. వీరినే 'అదాము అవ్వ' అని పిలుచుట, వీరే మానవుని సృష్టి కర్తలుగా నెంచిరి. (పాత నిబంధన 2.వ అ. 21.22.పుట.।)

ఈ విశ్వ సృష్టి గురించి బైబిల్ నుండి చూచినాము: దీని నిర్ధారణకు మతగురువులు దేవుని దూతలైన వారు ఈ క్రింది విధముగా తెలుపుచున్నారు. -

క్రీస్తుకు పూర్వము 4064 లో దేవుడైన యోహోవా ఆదిమానవుడైన, ఆదామును సృష్టించాడని క్రీ.శ. 1650 లో జేమ్స్ ఉషర్ అనే క్రిష్టియన్ మతగురువు చెప్పగల్గాడట.

ఈ సృష్టి కార్యము జరిగిన కాలాన్ని, తిధి - వార - నక్షత్రాల్తో సైతం చెప్పడానికి కైంబ్రిడ్జి యూనివర్శిటీకి చెందిన 'లైట్‌ఫుట్' అనే మరో అతను సిద్ధమైనాడు. క్రీస్తు 4.000 సంవత్సరం అక్టోబర్ 23వ తేదీన సరిగా ఉదయం తొమ్మిది గంటలకు దేవుడైన యెహోవా సృష్టి కార్యానికి ఉపక్రమించాడని ఈ లైట్‌ఫుట్ ఖచ్చితంగా తేల్చిపారేశాడు. అవును మత గురువు అంటే సామాన్యులా ? కాదు వారు దైవజ్ఞులు గదా, భూత భవిష్యత్తు - వర్తమానాల్ని చిటికేలో చెప్పివేయగలరు. (డార్విన్ పరిణామము వ్రాసినది సివి పుట.17.)

## 2.వ అధ్యాయము :-

(2) ఇక్కడ క్రైస్తవ మతగురువులు చూపిన తేదీలు సరైనవి కావుకదా ఆ మతగురువులకు మత స్థాపకుడైన '' ఏసుక్రీస్తు'' యొక్క జన్మదినమే వారికి తెలియదు. సృష్టి విషయమును గురించి ఏమి చెప్పగలరు. క్రీస్తు యొక్క జన్మదినము డిసెంబరు 24వ తేదీన ప్రతి సంవత్సరము జరుపుట మన అందరికీ తెలిసినదే కాని ఒకదినము

డా.సి. హెచ్. దేవానందరావుగారి సన్నిహితుడు వరల్డ్‌వైడ్ ఆర్గనైజేషన్ యొక్క ఏషియా డైరెక్టర్ డా. 'రైనార్'తో సంభాషించినప్పుడు పై తేది సరియైనదా అని అడిగినాను కాదాని వారు ఒప్పుకున్నారు. తరువాత దినము ఏసుక్రీస్తు యొక్క చరిత్ర వారి పుట్టిన తేది 20 ఫిబ్రవరి నెల పగలు 2.20 నిమిషములకు జరిగినట్లు భారత జ్యోతిష్య శాస్త్రజ్ఞులు కలియుగ ఆరంభము నుండి గణితము వేసిచూపినారు. దీనిని పాశ్చాత్య జ్యోతిష్యులు Bailly బెల్లిగారు కూడా ఒప్పుకున్నారు. ఇదియే కాక క్రీస్తు తూర్పునకు వచ్చియున్నారని ఫలితాన (అనే గ్రామమున (బ్యాపటిజం) అనగా బౌద్ధమతము స్వీకరించినట్లును, ఆ ఫలితాన పేరు ఇజ్రాయిల్‌లో పైలెస్టీన్ అను పట్టణమునకు నామనికింతము జరిగినది అని, యూదుల చరిత్రకారుడైన జరొస్టీన్‌గారు వ్రాసినట్లు, స్వర్గీయ పండిత రఘునందన్ శర్మ తమ వైదిక సంపతిలో చూపినారు. నేను వ్రాసి ఇచ్చిన ప్రతిని వారు చదివిన తరువాత తీసుకొన్నారని తెలుపనైనది. -

Note : Accordingly to the Astronamical calculation of the Hindus, the present period of the world Kaliyuga commenced 3102 years before the birth of the christ on 20th February at 2 hours 27 minutes and 30 seconds, the time being thus calculated to minutes and seconds. They say that conjuction of Planets than took place and their label show this conjuction. It was natural to say that a conjuction of the Planets then took Place. The calculation of the Brahamins is so exactly confirmed by or own astronnamical table that nothing but actual observation could have given so correspondents results. (Page No. 96) Viadic sampathy (the cogny of the Hindus by court Bjosnat Jema) Page no.32)

(3) మహమ్మదీయుల మత గ్రంథము 'కురాన్' లో బైబిల్ పాత నిబంధన ప్రకారమే ఉన్నది. మరియు ఇ ఖురాన్‌ను గాబ్రియల్ అనునతడు మహమ్మద్ ప్రవర్తకు ఇచ్చినట్లు కనపడినది. కాన ఇక్కడనే ముగించుట మంచిదనుకుంటాను. యింతవరకు సత్యార్థ ప్రకాశము, వైదిక సంపత్తి మరియు బైబిల్ లోని సృష్టిని గురించి తెలుసుకున్నాము. ఇప్పుడు మన అతి పురాతన గ్రంథములైన ఉపనిషత్తులలోని, ఐతరేయ బ్రహ్మణము - ద్వాదశలో చూడవలసి యున్నది.

**3.వ ప్రకరణము : - 1.వ అధ్యాయము . -**

ఐతరేయొపనిషత్తు - ద్వాదశ. 1 వ ఖండము :-

ఓం వాఙ్మేమన నీతి శానిః ప్రథమ అధ్యాయము - 1 వ ఖండము. -

(1) (నామ రూపములగా వికారమొంది కనబడునట్టి) ఈ ప్రపంచము సృష్టికి పూర్వము ఒక ఆత్మగా ఉండినది అతడు తప్ప వేరేదియు లేదు. ఆ ఆత్మ లోకములను సృష్టింపవలయునవి యాలోచించెను.

(2) ఇట్లాలోచించి, ఈ లోకములను సృష్టించెను అవి ఏవియన .-

అంభస్సు. స్వర్గలోకము, దానికి మీద నుండు మహలోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము మొదలగు ఈ లోకములను,

మరీచి.- సూర్యుని కిరణములచే వ్యాపింపబడిన అంతరిక్షలోకము.

మరము.- జీవులు నాశమొందడి భూమి, భూలోకము.-

అపస్సు.- జల సంబంధమైన భూమికి దిగువనుండు లోకములు.-

ఈ లోకములను జలమును ప్రధానముగా గల పంచ భూతముల వలన సృష్టించెను.-

(3) ఇప్పుడు నాచే సృష్టింపబడిన లోకములను పరిపాలింపనిచో నాశమొందును. కాబట్టి లోకపాలకులను సృష్టింతునని ఎంచి పైన చెప్పిన పంచ భూతములలో నుండి యే

'ఒక పురుషాకార పిండమును నిర్మించెను'.

(4) ఆ పిండమును గురించి ఇట్లు తలపోసెను. అందు పక్షి యొక్క గ్రుడ్డు వలె శిరస్సు కలిగెను.

(1) ఆ శిరస్సు నుండి వాగింద్రియమము కలిగెను. అందునుండి 'అగ్ని' దేవత కలిగెను.

(2) పిమ్మట నాసికము కల్గెను అందుండి ఘణేంద్రియము కల్గెను. అందుండి సర్వత్రా వ్యాపించి యుండు 'వాయు' దేవాత కల్గెను తరువాత.

(3) నేత్రములు కలిగెను - వాని నుండి చక్షుదింద్రియము కలిగెను, అందుండి ఆదిత్యదేవత కలిగెను. అనంతరం (ఈ) శోత్రము కల్గెను. దానియందుండి శోత్రేంద్రియము కలిగెను, అందుండి ద్గ్దేవత కలిగెను. (ఉ) పదంపడి చర్మము కలిగెను. అందుండి రోమములైన సర్వేంద్రియము కలిగెను, అందుండి ఔషధములు మొదలగు వానికి అదిష్టాన దేవతయైన 'వాయువు' దేవత కలిగెనం. అటుపిమ్మట (ఊ) అంతకరణమునకు, అదిష్టానమైన 'హృదయ' కమలము కలిగెను, అందుండి మానసేంద్రియము కలిగెను.

(ఋ) అందుండి 'చంద్ర' దేవత కలిగెను, తర్వాత (ౠ) నాభి కలిగెను, అందుండి 'పాయు' రింద్రియము కలిగెను. అందుండి, 'మృత్యు' దేవత కలిగెను. తదుపరి (ఎ) శిశ్నము కలిగెను. అందుండి (ఏ) 'రేతస్సు' అనెడి ఉపస్థేంద్రియము కలిగెను. అందుండి 'అప్దేవత' (ఐ) వరుణుడు పుట్టెను ఇట్లు లోకపాలకులను సృష్టించెను. - (పుట.8.)

ఐతరేయ పనిషత్తు - మొదటి ఖండము అధ్యాయము లలో చూపిన పిండాకారమును గురించి చూపిన విషయేంద్రియములను, వివరముగా చూపుచున్నాము.

అగ్ని .- వాగ్రూపముగా ముఖమునందును. -

వాయు.- ఘ్రాణముగా (ముక్కునందునా) నాసికము - ఆదిత్యుడు.

చక్షరింద్రియము.- నేత్రములందును.

శ్రోత్రేంద్రియము.- చెవులు యందును.

ఓషధి - వనస్పతులు. - స్పర్శేంద్రియముగా చర్మము నందును - అనగా వెంట్రుకలు.

చంద్రుడు.- మనస్సుగా - హృదయము నందును.

మృత్యువు.- పాయ్యింద్రియముగా - నాభియందును.

జలము. - ఉపస్థేంద్రియముగా - ఉపస్థము నందును - ప్రవేశించిరి (పుట 79.80.)

ఐతరేయోపనిషత్తు - ద్వాదశ - 2.వ అధ్యాయము - 2 వ ఖండము. -

సృష్టి క్రమము అర్థవాదము - అనగా ఈ జగత్తు యొక్క లక్షణమును సులువుగా భోదించుట కైల్లోక వ్యవహారమును కథ వలె చెప్పవలసి వచ్చినది. ఇందు ఆత్మనె రంగుట ముఖ్యము, కాని సృష్టి క్రమము నెఱంగుట వలన ప్రయోజనము లేదు (పుట.82.).-

సృష్టి మూలమును గురించి ఐతరేయోపనిషత్తు నుండి తెలిసి కొంటిమి, ఇక బృహోదారణ్యకోపనిషత్తు యందు చూపబడిన సృష్టి క్రమము గమనింతము.

**3.** వ **అధ్యాయము :-** బృహదారణ్యకోపనిషత్తు - ద్వాదశ - ద్వితీయ బ్రహ్మణము నందు చూపబడినది.

2). (1) ఇచ్చట సంసార మండలము నందు, అనగా జగత్తు నందు, సృష్టికి పూర్వము - నామరూపాదులు ఏమియు లేకుండెను. మృత్యువుచే నీ ప్రపంచము మఱిగింపబడి యుండినది (తనలోనైక్యమై యుండెను.). ఒకగొప్ప వృక్షము కాదగిన దాని సారమును, ఒక విత్తనము - ఇమిడ్చికొని యుండునట్లు మృత్యు అనగా భక్షింప (అనుభవింప) ఇచ్చి గల ఆత్మ - హిరణ్యగర్భరుండను ప్రజాపతిమాయ యందు ప్రతిబింబించిన ఆత్మ (స.గు.ణ. బ్రహ్మము).(ఆ మృత్యువు సృష్టింపదలంచి) మనస్సనేది ఆత్మతోం జేరుటకు దలంచెను. అనగా (మనస్తత్వము - మహతత్త్వమును సృష్టించెను).

3) (2) ఇది మృత్యువను ప్రజాపతి. తన్ను తాను శ్లాఘించుకొనెను. అనగా అహంకార తత్త్వము కలిగెను. అందుండి (ఆకాశము - వాయువు అగ్ని వీని మూలముగా - జలము) కలిగెను. పూజ్యుడైన నాకు జలము కలుగునుగాక, యని తలచిన మీదట జలము కలిగెను. జలమునకు కారణము పూజ్యమైన 'ఆర్క' మను అగ్ని కావున, 'ఆర్క' - అగ్నికి (అశ్వమేధాగ్నికి) పూజ్యత్వము సిద్ధించెను. ఇట్లు ఎవరండు తెలుసుకొనుచున్నాడో వానికి జలము సుఖము లభించును.

(అ) ఆ జలము పూజ్యనీయమైనది, అది పాలమీగడ వలెగట్టియైనది. ఆదే 'పృథివి' యాయెను. అందు మృత్యువు శ్రమతీర్చికొనెను. ఆప్రాజాపతి వలన తేజోరసమైన 'అగ్ని' కలిగెను. ప్రజాపతి విరాట్టు ప్రథముడు. శరీర, ఆండాంతర్గత విరాట్టుకలిగెను.-

(ఇ) అతడు (అవిరాట్టు పుట్టిన ప్రజాప్రతి) తన్నుత్రి విధములుగా గావించెకొనెను. ఆదిత్యుడు - వాయువు అగ్ని అని అతడు సకల భూతముల యొక్క 'ప్రాణము'.- పై చూపిన ఐతరేయోపనిషత్తు మరియు బృహదారణ్యకోపనిషత్తుల యందు చూపబడిన సృష్టి క్రమము గురించి తెలుసుకున్నాము. పతంజలీయోగ దర్శనమునాధారించి గమనింతము.-

**4.వ అధ్యాయము. - పతంజలీయోగ దర్శనము. -**

పతంజలీయోగ దర్శనమున సృష్టికి సంబంధించిన విషయము పేర్కొనలేదు. కాని 'సాంఖ్యము' 'యోగము' రెండు ఒకటే అనుకుంటే, సాంఖ్యంలోలాగానే ఈ పతంజలీ యోగములో గూడ ఈశ్వరుడు లేడు సాంఖ్యయోగాలు రెంటిలోను కూడ ప్రకృతే స్వాభావికంగా సామ్య పరిణామము వైషమ్య పరిణామము పొందుతుంది. ఎవరివల్లనో ప్రేరేపింపబడి ప్రకృతి వ్యవహార లాభం కలుగుతూనే ఉంది. సాంఖ్య సిద్ధాంతాన్ని అనుసరించి కర్తృత్వం గుణత్రయాలలో (సత్వర రజస్తమస్సులు) ఉంది పురుషునిలో - లేదు (పుట.36.) మంత్రం : నిమిత్తమ ప్రయోజకం - ప్రకృతీనాం - వరణభేదస్తుతతః క్షేత్రికవత్. (4 - 3) -

పతంజలీయోగ దర్శనాన్ని అనుసరించి జగత్తు యొక్క సృష్టి విషయంలో ప్రకృతికి స్వాతంత్ర్యం వున్నది. జడ ప్రకృతే పురుషునికి భోగాపవర్గాలను ప్రసాదించటానికి, జగత్తు రూపంలో పరిణతమౌతుంది. స్వతంత్రమైనందువల్ల ప్రకృతిని ప్రేరేపించే ప్రేరకుని అవసరం లేదు. 'నిర్మాత' కాకపోయిన అది జగత్తుకు అదిగురువే, '' ఊపదేష్టయేః - సర్వేషామసిగురుః, కాలేనాన వచ్ఛేదాత్,'' అనే తర్వాతి సూత్రం ప్రకారం అంటే, స్వతంత్రమైన ప్రకృతినే ఆదిగురువు, ఉపదేష్ట అనవచ్చు. (పుట . 37)

ఇక్కడ మనము చూచినది ఏమంటే, సృష్టి క్రమము గురించి ఏమియు చెప్పబడలేదు. కాని ప్రకృతి గురించి మరి యోగము గురించి వివరించబడినది.

**5వ అధ్యాయము - ముండకోపనిషత్తు - ద్వాదశః-**

భద్రం కర్ణేభిరితి - శాన్త్రః ప్రథమ ముండకము - 1వ ఖండము -

(1) (ఇంద్రాది) దేవతలకంటే మొదటివాడు బ్రహ్మదేవుడు. అతడు జగమునువాడు వేరనియును, ఆత్మ వేరనియును, భేద బుద్ధి కలుగుచున్నదో, వానికి భయము కలదు.

అంతయూ సృష్టించెను. అతడు లోకరక్షకుడు, అతడు సకల విద్యలకు స్థానమైనవాడు. అతడు తన జ్యేష్ఠ పుత్రుండగు 'అధర్వుడను' వాని కొరకు బ్రహ్మవిద్యను బోధించెను. (పుట.43)

(5) ఆ పురుషుని యొద్ద నుండి అగ్ని కలిగెను. ఆ అగ్నికి సమితులు, ఆ చంద్రుని వలన మేఘము కలిగెను. మేఘము వలన భూమి యందుండు ఓషధులు కలిగెను. ఔషధుల వలన పురుషుని రేతస్సు కలిగెను. ఆ రేతస్సు వలన ప్రజలు కలుగుచున్నారు. (ద్వితీయ ముండకము 1 ఖండము)-

**6వ అధ్యాయము :**

**తైత్తిరీయోపనిషత్తు - ద్వాదశ (7వ అను వాక్యము - ఆ (పుట70)-**

ఈ జగత్తు సృష్టించుటకు పూర్వము, అసత్తుగా నుండి నది (నామరూప భేదములచే వికారమొందక, అవాకృత రూపమైన బ్రహ్మము నుండినది) అందుండి సత్తు కలిగెను. నామరూపవిశేషముచే - వికారమై - వికారమై వ్యాకృతరూపమైన జగత్తు కలిగెను. 'ఆసత్తు తన్ను సత్తు'గా జేసికొనెను. (ఆది బ్రహ్మము) సుకృతమని చెప్పబడుచున్నది. సుకృతమనగా 'స్వయంకర్త' లేక పుణ్యము అని ఈ బ్రహ్మ వస్తువు సుకృతమై యుండుట వలన - రసమై మాధుర్యరస పదార్థమై యున్నది.

ఆ రసమునునుభవించిన వానికి ఆనందము కలుగును. అది హృదయాకాశము నందు, ఆనందరూపమై యున్నది. అది అట్లుండని యెడల ప్రాణావృత్తునొనర్చు వారెవ్వరు ? అది లోకమునకు సుఖము నొసంగుచున్నది. ఎప్పుడొక సాధకుడు కనబడినదియును, శరీరము లేనిదియును, ఇట్టిదని గుర్తించి చెప్పుటకు కానిదియను, గుర్తించుటకు అవకాశము లేనిదియును అగు ఆత్మ యందు ధైర్యముతో, తన్ను పొందించునో, అప్పుడువాడు ఆ భయమును పొందును. ఎప్పుడొకనికి తాను

తెలిసిన వాడైయుండినప్పటికినీ భేద బుద్ధి కలవానికి భయము కలదు. (పుట-70)

తైత్తిరీయోపనిషత్తు సారాంశము అవిద్య కామ కర్మోపాదన, హేతుని వృత్తియైన మీద స్వాత్మ న్యవస్థానమనేడి మోక్షము సిద్ధించును. అనగా తన ఆత్మనెరింగిన మోక్షము లభించును. అట్టి పరబ్రహ్మ విద్యను భోదించునదే ఉపనిషత్తు. బ్రహ్మము సమీపమునందు చేర్పించుటయే ఉపనిషత్తు అనబడును. (పుట 76-77)

**7వ అధ్యాయము - మనుస్మృతి - మానవధర్మ శాస్త్రము :**

(1) శ్లోకము - అసీదిధంతయో భూత, మప్రజ్ఞా తమలక్షణం,

అప్రతర్క్యమవిజ్ఞేయం, ప్రసుప్తమితి సర్వతః (5) -

తాః ఈ ప్రపంచము ప్రళయ కాలమందు చీకటియై యుండెను. (ప్రకృతి బ్రహ్మా కారమున నవ్యాకృతమై వేరుపడనిదై యుండెను. (కనుకనే ప్రత్యక్ష ప్రమాణ గమ్యము గానిదియు, లక్షణము లేనిదియును, ఊహింపనలవి కానిదియు, శబ్దదము చేతను, గమ్యముగానిదియును, నైయంతయు నిద్రించుచున్నట్లుండెను.

(2) శ్లోకము : తతస్స్వయం భూర్భగ, వానవ్యక్తోవ్యం జయన్నిదం,

మహాభూతాది వృత్తౌజౌః ప్రాదురా సీత్తమోనదః (6).

తాః ఆ ప్రళయానంతరమున నైశ్వర్యాదులతో కూడినవాడును, యోగాభ్యాసముచే, నెరుంగ దగినవాడును, అడ్డులేని సృష్టి సామర్థ్యము గలవాడును పరమాత్మ తనంతట తానుత్పన్నుడై యా మహాభూతాదులను ప్రకాశ పరుచుట; ప్రకృతి ప్రేరకుడై ఆవిర్భవించెను.

(3) శ్లోకము - మనస్సునిష్టం వాకురుతే చోద్యమానం - సీస్పృక్షయా,

ఆకాశం జాయతే తస్మాత్తం - శబ్దంగుణం విదుః(44).

తా॥ బ్రహ్మచే పురికొల్పింబడిన మనస్సు మహత్తర సృష్టి చేయ ప్రారంభించేను. అట్టి మహత్తు నుండి ఆకాశము పుట్టెను. ఆకాశమునకు శబ్దము గుణమని చెప్పుదురు.

(4) శ్లోకము - ఆకాశాంతు వికుర్వాణాత్సర్వ - గంధవహాశ్శుచిః,

బలవాన్ జాయతే వాయుస్సలై స్పర్శగుణోమత : (45).

తాః వికారములను బుట్టించునట్టి యాకాశము నుండి సుగంధ, దుర్గంధములను, గొనిపోవునదియు, పవిత్రమైనదియు, బలిమిగలదియునైన వాయువు పుట్టినది. అట్టి వాయువు స్పర్శ గుణము గలదందురు.

(5) శ్లోః వాయోరపి వికుర్వాణాది రోచిష్ణు - తమో నుదమ్,

జోతిరుత్పద్యతే భాస్వత్త - ద్రూపగుణము చ్యతే ॥ (46).

తా : వికార జనకమైన వాయువు నుంచి ఇతరములను ప్రకాశింపః జేయునదియు, మిక్కిలి ప్రకాశము గలదియు, చీకటిని పొగొట్టునదియు, నైన జ్యోతిస్సు పుట్టినది. ఆ జ్యోతిస్సునకు రూపమే గుణము అని యందురు.

(6) శ్లోః జ్యోతిశ్చ వికుర్వాణా దాపో - రసగుణాః స్మృతాః,

ఆద్భ్యోగంధ గుణాభూమిరిత్యేషా సృష్టిరాదితః (47).

తా : వికారగుణము గల ఆ జ్యోతిస్సు నుంచి 'జలము' పుట్టినది. ఆ జలము రస గుణము గలది. ఆ జలము నుండి గంధ గుణము గల 'భూమి' పుట్టినది. ఇదియే మహా ప్రళయానంతరమైన సృష్టికి మొదటి భూత సృష్టి ; ఆ భూతముల వలన నేయవాం సృష్టికిం పిద పనుగల్గిన భూతాదిలోకత్రయ నిర్మాణము.

**4. నాల్గవ ప్రకరణవము - వైశేషిక దర్శనవము - కణాది మహర్షి ప్రణీతము-సృష్టిక్రమము - చతుర్థాధ్యాయము- ప్రథమహ్నికము (పుట. 129).**

కణాది మహా ఋషి అణుశాస్త్రము నుండి పండిత గోపదేవు శాస్త్రిగారు తమ వైశేషిక దర్శనము (కణాది మహర్షి ప్రణీతము) అను గ్రంథము నుంచి వెలి తీసిన సృష్టిక్రమము - ఈ విధముగా నున్నది. పూర్వాధ్యాయములందు పృథివ్యాది (న వ)ద్రవ్యములు పరీక్షింపబడినవి. జీవేశ్వర భేదములచే భిన్నము అగు నాత్మ ద్రవ్యమును విడిచి మిగిలిన ద్రవ్యములకు మూలకారణమైన ప్రకృతి పదార్థమును పరీక్షింపగోరి ఈ యధ్యాయమున ముందు ప్రకృతి రూపమును మహర్షి చూపుచున్నారు.

సూత్రం :- నదకారణవన్నిత్యమ్ - 4-1-1.

తాః ప్రకృతి (సత్) ఉనికి గల దనుటచే ఆ సత్తని గాని ఆ భావమని గానియన నొప్పదు. కారణము లేనిదనుటచే ఇచ్చారూప గుణమునంజనదు. నిత్యమనటుచే క్షణికమగు విజ్ఞానము కంటెను - కూట స్థనిత్యమగు (పరిణామము జెందని) బ్రహ్మకంటెను భిన్నమనియే సూత్రాభిప్రాయము. ప్రకృతి పరిణామ నిత్యము. అనగా మార్పు చెందుచు నిత్యముగా నుండును.

ప్రశ్న : అ. వ. ప్రకృతి సత్పదార్థము అనుటకు హేతువేమి?

సూత్రం : తస్యకార్యం లింజమ్. 4-1-2.

తాః ప్రతికార్యము సోపాదానకము - ఉపాదానకారణము గలది. ఘటాదుల వలె ఈ జగత్తు కూడ సావయవమగుట వలన సోపాదానకమే - కావలియును. కాబట్టి ఈ జగత్తునకు ఉపాదానకారణము. (సమవాయికారణము) అయిన వస్తులేనిత్యమైన మూలకారణము. అది ప్రకృతి యనబడును.

ప్రశ్న : (అ.వ.) కారణమునకు కార్యమెట్టు లింజ్ఞము. హేతువు ప్రమాణమగును?

సూత్రం : కారణ భావాత్కార్యభావః 4-1-3.

తాః ఏ పదార్థము యొక్క సత్వా సతముల వలన దేని సత్వాసత్యములుండునో, ఆ (కార్య) పదార్థము దానికి లింగము అని ధ్రువమైన నియమము. కార్యభావా -

భావములు (ఉనికి లేములు) కారణ భావాభావముల వలన నియమముగా నేర్పడుచున్నవి. ఈ నియమమెక్కడను తప్పదు.

కాబట్టి కారణమునకు కార్యము లింగమగును. మనమీ లోకమున గల కొండొక స్థూల ఘటాది కార్యమును అవయవములుగా విభజించుచు పోయిన - చివర కొక యల్పతమావయవ విభాగ అవస్థను పొందుదుము. ఆ యల్పతమావయవము విద్యుత్సాహయ్యమునను విభజింప వీలుగాని పరిస్థితిలో నుండి యుండును. అట్టి దానినే పరమాణువందురు. ఆ పరమాణువుల నంతములు ఈ పృథ్వ్యాది పరమాణువులు వేయి తరములలోను లెక్కింపనలవి గావు. ఆ వియవాంతర భేదములచే ననేక విధములయనీ సత్వర జస్తమో భేదములచే ముప్విదముల విభజింపబడుచున్నవి. (పుట 129 - 131).

సూత్రం : అణుత్వ మహత్త్వాభ్యాంకర్మ గుణాశ్చ. 2-1-16.

అర్థం : అణుత్వమహత్త్వాభాం. అణుత్వామహత్త్వముల ద్వారా, కర్మగుణాశ్చ. గుణకర్మములు కూడ అణుత్వమహత్తవ రహితములు అనివ్యాభ్యాతః నిరూపింప బడినట్లెంచున్నది.

తాః అణుత్వ మహత్త్వములు పరిణామ బోధకములు, కాబట్టి పరిణామము గుణమగుటచే నవి గుణములగును అందువలన గుణకర్మము లందు అణుత్వ మహత్త్వము లుండనేరవని సూత్రాభిప్రాయము.

సూత్రం : పోతనదీర్ఘ త్వహ్రస్వత్వేవ్యాఖ్యాతే. 2-1-17.

తాః అణుత్వ - మహత్త్వముల వలనే దీర్ఘత్వ హ్రస్వత్వములను తెలియునది. ఎక్కడ అణుత్వ - హమత్త్వము లుండునో వానియందేహ్ర స్వత్వదీర్ఘత్వములందును అవి లేని చోట నివియుండవని సూత్రాభిప్రాయము.

**2వ అధ్యాయము :**

భౌతికవాదము - అణు - పరమాణు - శక్తి - శ్రీభవతీ ప్రసాద్ - శ్రీవాత్సవ .-

మానవునికి పుట్టుకతోనే లబ్బినది అమోఘమైన శక్తి - దాని సహాయముతో మానవుని చేష్టలు, ఆకారాలు ఇతర జంతువులకంటే భిన్నమై విలక్షణతను చాటు చుండును. ప్రాచీన మానవుని పరిశీలించినచో అతడు ఇతర పశువు, పక్ష్యాది జంతువుల కంటే మిక్కిలి అశక్తుడుగానో చరిస్తాడు. క్రూరమృగాదుల నుండి తనకు తాను రక్షించుకొనే శక్తి, సాధనము మానవుని వద్ద లేకుండెను. అతని వద్ద ఇతర జంతువుల మాదిరిగా కాక కొంత విలక్షణంగా ఉన్నది బుద్ధి. ఆ బుద్ధి మహత్యము తోనే మానవడు ఇతర జీవులకంటే విలక్షణుడుగా గోచరిస్తాడు. తనబుద్ధి శక్తితో తనను రక్షించుకొనగల్గుటే గాక సకల జీవరాసులపై తన ఆధిపత్యమును కూడ కొనసాగించగలుగుతున్నాడు.



ఆ బుద్ధి-శక్తి ద్వారానే మానవుడు ప్రకృతిలో ఉండే విశేషాలను తెలుసుకొని, అందలి రహస్యాలను వెలికి తెచ్చుటేగాక వాటిని తన ఆధీనముగావించుకొన్నాడు. మానవ జీవనోపాధికనుకూలముగా ప్రకృతిని మళ్లించుకొనగల్గుతూనే అనంత భౌతికవాద వికాసానికి తన శక్తిని, వినియోగించి ప్రకృతిపై విజయం సాధిస్తున్నాడు. ఈ అంశాలే శ్రీవాత్సవ గారి గ్రంథంలో ఈ విధంగా పొందుపరుపబడ్డాయి.



**3వ అధ్యాయము :**



అతః స్థూలము యొక్క ప్రత్యక్ష జ్ఞానము ఆధారముపై భౌతిక (జగత్) ప్రపంచము యొక్క వివేచన చేసి దాని యొక్క రూపు రేఖ నిర్ధారణ చేయబడినది. యునాన్ యొక్క దార్శనికులు మొత్తము నాల్గు మూలాల పదార్థములతో సంపూర్ణ సృష్టి యొక్క నిర్మాణమునకు కల్పన చేసినారు. మన ఋష్యాదుల సైతము - చితి - జల్ - పావక్, గగన్, సమీర యొక్క విభిన్న సంయోగ - వియోగము (జగత్) ప్రపంచము యొక్క (గఠన్, విగఠన్) అనగా ప్రయోగము - విప్రయోగమును జటిలమున, మొదటి జరిగిందనే అనుకున్నాడు. (పుట 2 7)

**4వ అధ్యాయము :**

ప్రకృతిపైన విజయమును పొందుటకు వాస్తవమైన దృష్టి పాశ్చాత్య దేశములో పనిచేయబడుచున్నవి. ఈ పరంపరయొక్క సర్వ ప్రథమ - వాయు శక్తిని తత్కాలమున వైజ్ఞానికులు బంధించిరి. మరియు దాని ప్రభావముతో మన కిస్తీలు పడవలు మరియు జహాజ్ (స్టీమర్)ను నీళ్లమీద నడిపిరి. తర్వాత గాలితో (చక్రి) చక్రము కూడ త్రిప్పిరి, తిరుగుతూవున్న నీళ్ళ శక్తిని కూడ చక్రమును తిరుగుటకు వాడబడిరి. తర్వాత (భాఫ్) స్టీమ్, అనగా ఆవిరి శక్తితో విద్యుత్ శక్తిపై (నియంత్రన్) నియంతరముగా ప్రాప్తించుటలో మనుష్యుడు సఫలుడైనాడు.- (పుట.3).

**5వ అధ్యాయము :**

అణు - మోలెక్యూల్ పదార్థము లేక మూల తత్వము యొక్క అన్నిటికన్న చిన్నది. అటువంటి ఇకాయి అవుతుంది. ఇందులో సాధారణమైన, రెండు లేక (ఎక్కువ) దానికన్న ఎక్కువ పరమాణు రసాయినిక విధముగా కలిసియుండెడివి. దీన గుణాము దీవిలో ప్రస్తుతము వున్న పరమాణు యొక్క గుణములకు భిన్నంగా యుండును. ఉదాహరణకు, నీళ్లలోని ఒక అణువులో రెండు పరమాణువుల హైడ్రోజన్ యొక్క మరియు ఒక పరమాణు ఆక్సిజన్ యొక్క కలసి యుండును.

చూడుడు పరమాణువు. (పుట.12).

**6వ అధ్యాయము :**

**పరమాణు వాదము :**

ఈ సిద్ధాంతము యొక్క ప్రవర్తకుడు, బ్రిటిష్ వైజ్ఞానికుడు డాల్టన్. ఇతని అభిప్రాయమును అనుసరించి మూల తత్వము యొక్క అన్ని పరమాణువుల 'హరమాన్‌మే' అన్ని భావములతో వొకటిగానే యుండును. అది అదృశ్యమై అవిభాజ్యమైనదిగా ఉంది. (విభజింప వీలు లేనిదిగా) లేక రసాయినికము క్రియలతో కలసి యుండును. ఆధునిక అణుసంధానము యొక్క వెలుతురులో డెల్టన్

మహాశయుని యొక్క పరమాణు వాదములో (సుధార్) మార్పు చేయబడినది. పరమాణువులను, విభజింపవచ్చును, లేక నొకటిగా మూల తత్వములో విభిన్న ప్రకారముగా పరమాణు సమస్థానమును తెలుసుకోగలము. (పుట 96-97).

పై చూపిన అణు - పరమాణు వాదమును గురించి చర్చించినాము కదా, ఈ పరమాణు వాదమునకు తోడ్పడు ఆయా స్కాంతత్వము - సూత్రములు, భౌమాయస్కాంతముల గురించి, ఫిజిక్స్ నుండి వెలితీసిన విషయములను మీ ముందు పెట్టుచున్నాము.

**7వ అధ్యాయము :**

అయస్కాంతత్వము - ఫిజిక్ (సైన్స్) పుస్తకము

అయస్కాంతములో సూత్రం - ఫిజిక్స్ - భౌమాయస్కాంతము -----

అయస్కాంతములకు ఈ అయస్కాంతత్వము ఎట్లు కలుగుచున్నది, అను విషయము ముఖ్యము, దీనికి రెండు సిద్ధాంతములు గలవు.

1) అయస్కాంతీకరణ - కణ సిద్ధాంతము.

2) ఎలక్ట్రాన్ సిద్ధాంతము - వీటిని గురించి క్లుప్తముగా తెలుసుకొనెదము.

**1) అయస్కాంతీకరణ - కణ సిద్ధాంతము :**

అయస్కాంత పదార్థములన్నియు కణ రూపములో నున్న చిన్న చిన్న అయస్కాంతములను కలిగి యుండును. కాని ఇవి అయస్కాంత పదార్థములో ఒక క్రమములో అమర్చబడి యుండవు. కాని ఎప్పుడైతే ఆ అయస్కాంత పదార్థ - పదార్థము (ఉదాహరణ - ఇనుము) అయస్కాంతముగా తయారు చేయబడునో దాని యందలి అయస్కాంత కణములన్నియు ఒక ప్రత్యే దిశలో అమర్చబడును. ఇవి అయస్కాంతేతర పదార్థములలోని (రాగి - బంగారము - వెండి - ఇనుము)లు అయస్కాంతముగా వ్యవహరింపబడలేవు. ఇక్కడ చూడవలసినది కణ పదార్థములు - అణువులుగా

లెక్కించిరా? మరి ఇక్కడ ఎలక్ట్రాన్ సిద్ధాంతము చూడవలసి యున్నది.

**2) ఎలక్ట్రాన్ సిద్ధాంతము :**

ఇది నవీన సిద్ధాంతము. ప్రతి మూల పదార్థము అనేక అతి చిన్న కణములచే నిర్మింపబడినది. వీటినే పరమాణువులందరు. ఈ పరమాణువును విడగొట్ట శక్యము కాదని 18వ శతాబ్దము వరకు డాల్టన్, ఎవగాడ్రో అను శాస్త్రజ్ఞులు భావించిరి. కాని 19వ శతాబ్దములో పరమాణు సృష్టి కనుగొనిరి. ఇక్కడ మనము చూడవలసియున్నది. అణుపదార్థము - కణరూపములో నున్న చిన్న చిన్న అయస్కాంతములను కలిగి యుండునని, మరి ఒక దగ్గర కణములన్నియు అయస్కాంతేతర పదార్థము - అనడము ఎంతవరకు ఇది నిజము? అణు పదార్థము భూమిలోనున్నదా? వుంటే సృష్టి ఎట్లు ఏర్పడినట్లు, దేనితో సృష్టి ఉద్భవించినట్లు, సైంటిస్టులు కనుగొనలేదు. బిగ్ బ్యాంగ్ సిద్ధాంతము చూపినది మొదట అగ్ని ఉద్భవించినదని చూపినారు, కాని అది ఎట్లు? అణు అనగా ఆటమ్ అని చెప్పుట, అణుబాంబులు తయారుచేయుచున్నవి. న్యూక్లియర్ పదార్థము నుండి తీయుచున్నది గూడ అణు చెప్పుట, ఇది సమంజసముగాదు. ఆటం అనగా పరమాణువు. ఈ పరమాణువులలో న్యూక్లియర్, ప్రోటాన్లు యున్నవి అని శాస్త్రజ్ఞులు చెప్పుటకద్దు. కాని అణుపదార్థము కనిపెట్టినట్లు తెలియజేయలేదు. ఇక్కడ అణు పదార్థము సృష్టి కన్న ముందు యుండినది, తర్వాత సృష్టి అగ్ని రూపముతో వెదజల్లినది, ఈ అణు పదార్థమని తెలుసుకోగలరు, ఈ అణువులు రెండుగా నుండెను. వాటిని ఒక మహత్తర శక్తి కదలించెను, అప్పుడు ఆ రెండు పదార్థములు ఢీకొని, అగ్నిగా ఏర్పడెను. ఇదియే సృష్టికి మూలము, తర్వాత కనబడుచున్నవి పరమాణువులే, ఈ పరమాణువులతో ఎలక్ట్రానికి అటువంటివి కనిపెట్టుట, ఇతరత్రా వాటికి గూడ ఉపయోగించడము జరుగుచున్నది. విశ్వావిర్భావమును సిద్ధాంతములో చూడుడు. మరియు భౌతిక వాదము నందు అణు

విశ్వావిర్భావమును సిద్ధాంతములో చూడుడు. మరియు భౌతిక వాదము నందు అణు విషయమున చూడడు. పైన చూపిన వేదమంత్రముల నుండియు, ఉపనిషత్తుల యొక్క వివరణలు, మనుస్మృతి చూపిన మానవ ధర్మశాస్త్రము - వైశేషిక దర్శనము - కణాదిమహర్షి అణుప్రతీకరణము, పతంజలి యోగ దర్శనము భౌతికవాదములోని - అణు - పరమాణు - శక్తిని గురించియు - ఫిజిక్స్ - సైన్స్ నుండి చూపిన విషయములను, మరియు డార్విన్ గారి కొన్ని అంశములు, మత గ్రంథములలోని సారాంశములు పరిశీలించిన మీదట, యిప్పుడు విజ్ఞాన శాస్త్ర పరిశోధనల వలన వెల్లడించిన విషయములను, నాకు అందిన సమాచార పత్రిక నుండి మరియు డార్విన్ పరిణామవాదం నుండి చూడవలసినవి యున్నది.

**8వ అధ్యాయము :**

**డార్విన్ పరిణామ వాదం : ( రా.సి.వి).**

డార్విన్‌గారు వ్రాసిన పరిణామ వాదం ఇంగ్లీషు నుండి తెలుగులోకి అనువదించి చూపిన సి.వి. గారు డార్విన్ కన్నా హిందు మత గ్రంథాల నుండి, బైబిల్, ఖురాన్, ఉపనిషత్తుల నుండి చాల వివరముగా చూపినారు. అందుండి మొట్టమొదటి పరిణామము భూమి. -

**9వ అధ్యాయము :**

**భూమి :** ప్రప్రథమంలో భూమి మండుతున్న అగ్నిగోళంగా వుండేది. భూమి పుట్టిన నేటికి 450 కోట్లు సంవత్సరములు, అయితే ఈ సుదీర్ఘ కాలంతో 200 కోట్ల ఏళ్లు భూమండలం పై ఏ విధమైన ప్రాణీ లేకుండానే గడిచి పోయినదని శాస్త్రవేత్తలు నిర్ధారించారు అని చెప్పడము జరిగినది. (పుట 45).-

(మరి ఇక్కడ భూమి పుట్టినది సరియైనది కాదు) సృష్టి క్రమములేనిది భూమి ఎట్లు పుట్టినది ? మరికొందరు విజ్ఞాన వేదిక నుండి బయలుపడిన విశ్వావిర్భావ సిద్ధాంతం లెట్లున్నవి ఈ దిగువ నుదహరించుచున్నాము.

**10వ అధ్యాయము :** - విశ్వావిర్భావ సిద్ధాంతము నుండి వెలువడినది - ( ఈనాడు వారపత్రిక తేది : 26/1/92) (రా. శ్రీకళ్యాణ్).

పదిహేను వందలు కోట్ల సంవత్సరాల నుంచి మిస్టరీగా మిగిలిన రహస్యమును, ఈ దశాబ్దములోపు - ప్రపంచానికి విప్పి చెప్పావునే ధీవమా శాస్త్రజ్ఞులలో పెరుగుతుంది. విశ్వావిర్భావం ఎలా జరిగిందో శాస్త్రజ్ఞులు సూత్రప్రాయంగా ఇప్పుడు చెప్పగలుగుతున్నారు. అదే సరియైనదన్న విషయాన్ని ఖాయం చేయటానికి మరో పదేళ్లు చాలనివారు అంటున్నారు. విశ్వావిర్భావం గురించి ఎన్నెన్నో సిద్ధాంతాలున్నా వాటన్నిటిలోకి బహుళ ప్రాచుర్యం, బహుళ ఆమోదం పొందిన సిద్ధాంతం మాత్రం ఒక్కటే. అదే (బిగ్ బ్యాంగ్) థియోరీ, అత్యంత శక్తివంతమైన ఒక అగ్నిగోళం ఒకటి ప్రేలి పోయినందువల్ల, అందులోని 'శక్తి' చిందరవందర అయి తిరిగి ఒకటిగావటం వల్ల గ్రహాలు, ఫలితంగా విశ్వం రూపం దిద్దుకొందని బిగ్‌బ్యాంగ్ థియోరీ వివరిస్తున్నది. ఈ సిద్ధాంతం నిజమా, కాదా అనే అంశాన్ని ఇప్పుడు శాస్త్రజ్ఞులు పరిశోధనాలయాల్లో పరీక్షకు పెడుతున్నారు..

**11వ అధ్యాయము :**

**సెర్న్‌లో శల్య పరీక్షలు :** జెనీవాలోని యూరోపియన్ పార్టికల్ ఫిజిక్స్ లేబరేటర్ (సెర్న్)లోను, అమెరికాలోని బ్రూక్ హవన్ నేషనల్ లేబరేటరీలోను, విశ్వావిర్భావ సిద్ధాంతం పరీక్షలకు గురి అవుతోంది. ప్రయోగశాలలో పరీక్షకు పెట్టేముందు, శాస్త్రజ్ఞులు, విశ్వావిర్భావ కాలం నాటి పరిస్థితులను పూర్తిగా ఆకళింపు చేసుకున్నారు. బిగ్‌బ్యాంగ్ థియోరి ప్రకారం, ఒక పెద్ద, అగ్నిగోళం బద్దలయితే అందులోని శక్తి అంతా నేడు మన కంటికి కనిపిస్తున్న పదార్థంగా ఎలా రూపొందించిందనేది తొలిప్రశ్న? పదార్థ సిద్ధాంతం ప్రకారం ''అణువు '' లో ఉండే 'న్యూట్రాన్లు' - 'ప్రోటాన్లు' వంటి వన్నీ 'క్వార్క్' అనే ప్రాథమిక పదార్థాలతో ఎలా రూపొందాయి? ఇవన్నీ 'గ్లూయాన్స్' అనే శక్తి వల్ల ఒకదానితో ఒకటి అనుసంధానమయి ఉన్నాయి. న్యూట్రాన్లు - ప్రోటాన్లు

కలిసి ఉండేదాన్ని 'హాడ్రాన్' అంటారు. హాడ్రాన్ పరిధి నుంచి క్వార్క్ పొది కదలి పోకుండా గ్లూయర్ శక్తి కనిపెడుతుంటుంది. అయితే బిగ్ బ్యాంగ్ జరిగిన తొలి సెకను కన్నా తక్కువ కాలంలో హాడ్రాన్ లేవి ఉండి ఉండకపోవచ్చు. కనుక అప్పుడు క్వార్క్‌లు, గ్లూయాను కలిసి ఉన్న పదార్థం ఉండి. - ఉండవచ్చు ఈ క్వార్క్ - గ్లూయాన్ సైతం ఆ స్థితిలో కేవలం ఒక సెకన్‌లో కొన్ని కోట్లు భాగమంత సమయమే ఉండి ఉండవచ్చు. ఆ సమయములోనె ' ఆవిరి' నీరైన తీరులో హాడ్రాన్లు రూపుదిద్కొని ఉంటాయి. తరువాత కథ మామూలే. హాడ్రాన్ల పరిధి నుంచి క్వార్క్ ఏది కదిలి పోకుండా, గ్లూయాన్ కనిపెడుతుండవచ్చు, ఫలితమే విశ్వావిర్భావం.

**12వ అధ్యాయము :**

**కాంతి వేగంతో కదలికలు :** క్వార్క్ - గ్లూయాన్, హాడ్రాన్‌ల స్థితి మార్పు సమయంలో 'పదార్థం' ఏయే రూపాలను పొందుతుందో గుర్తించటానికి శాస్త్రజ్ఞులు సెర్నలోను బ్రూక్ హెవెన్ లోను పరిశోధనలు చేస్తూ వున్నారు. దీనికోసం, వారు 'లాటిస్ - గేజ్' థియోరీ అనే కొత్త పద్ధతిని రూపొందించారు. ఈ పద్ధతిలో అప్పటి 'శక్తి' సాంద్రత' (ఏనర్జీ - డెన్సిటీ) ఒక ఘనపు సెంటిమీటరుకు 2 నుంచి 3 ఓగా ఎలక్ట్రాన్ వోల్టులని లెక్కించారు. (ఫెంటోమీటర్ : 10 -15 మీటర్లు) మరొకవంక భారంగా ఉండే అయాన్లు (హెవీ అయాన్స్) కిరణాలు, పార్టికల్ ఆక్సిలేటర్స్‌లో ఢీకొట్టుకునేలా చూస్తున్నారు. ఈ హెవీ ఆయాన్స్ ఉండే న్యూక్లియైలను పార్టికల్ ఆక్సిలేటర్స్‌లో అతివేగంగా కదలేలా చూస్తూ వాటి కదలికలకు వ్యతిరేక దిశలో వచ్చే వాటిని ఢీకొనేలా చూస్తున్నారు. ఇలా రెండు పరస్పర వ్యతిరేక దిశల్లో వచ్చే హేలీ న్యూక్లియైలు ఢీకొన్నప్పుడు ఏం జరుగుతుందో తెలుసుకోవాలంటే బంగారం న్యూక్లియన్‌ను కాంతి వేగానికి 0-999957 రెట్లు వేగానికి సమమైన వేగంతో కదిలేలా చూడాలి.

**13వ అధ్యాయం :**

**బంగారంతోటి ప్రయోగం :** బంగారం న్యూక్లియస్‌లో 118 న్యూట్రాన్లు (తటస్థ గుణం ఉండేవి) ప్రోటాన్లు (ధన గుణం ఉండేవి) ఉంటాయి. అంటే దానికి 79 యూనిట్లు ధన గుణం ఉంటుందన్నమాట. ఈ గుణం వున్న కారణంగా దీన్ని అయస్కాంత క్షేత్రాల ఆధారంగా అతి వేగాలతో కదిలేలా చేయొచ్చు. ఈ వేగంతో సాపేక్ష సిద్ధాంతం ప్రకారం న్యూక్లియస్ ద్రవ్యరాశి పెరుగుతుంది. దాని రూపం, అది కదులుతున్న దిశలో 'రొట్టెముక్కలా' అవుతుంది. దీని ఫలితంగా దాని ద్రవ్యరాశి 108 రెట్లు పెరుగుతుంది. ఇలాటి, న్యూక్లియస్‌కు గనుక, వ్యతిరేక దిశలో వస్తున్న సమానమైన న్యూక్లియస్ ఢీకొంటే, ఢీకొన్న సమయంలో న్యూక్లియైల పదార్థ సాంద్రత, మామూలు బంగారం న్యూక్లియస్ పదార్థ సాంద్రతకు 20 వేల రెట్లు అధికంగా ఉంటుంది. ఇలాటి పరిస్థితినే భార మూలకాలైన సీసం, యురేనియం వంటి వాటిలోను చూడవచ్చు. రొట్టెముక్కల ఆకారంలో వుండే న్యూక్లియై, ఒకదాన్ని ఒకటి తోసుకుంటూ కదులుతుంటాయి. ఇలాటి స్థితిలోనే విశ్వావిర్భావ కాలంలో క్వార్క్‌లన్నీ విడిపోయి పరస్పరం వేరే వాటిలో జత పడి ఉంటాయని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. కదులుతూ ఢీకొట్టుకొంటున్న న్యూక్లియైల నుంచి వెలువడే శక్తి నుంచే, పలు 'రేణువులు' రూపొందుతూ, గ్రహాల ఆవిర్భావానికి దారితీసి ఉంటాయని శాస్త్రజ్ఞులు విశ్వసిస్తున్నారు. సెర్న్‌లోను - బ్రూక్ హెవన్‌లోను శాస్త్రజ్ఞులు ఈ యొక్క ప్రయోగానికి రూపకల్పనలు చేస్తూ వున్నారు.

**14వ అధ్యాయము :**

**విశ్వ రహస్యాల పేటిక విప్పుతున్న 'కోబ్' - విశ్వావిర్భావ సిద్ధాంతము :**

రా.పి.యస్. రావు, ఈనాడు దినపత్రిక ది 17 మే, 1992.

1500 కోట్లు కాంతి సంవత్సరాల నాటి మాట, విశ్వావిర్భావం ఎలా జరిగినదనే విషయం మీద చాలా సిద్ధాంతాలున్నా, వాటిలో బహుళ ప్రాచుర్యం

పొందింది. 'బిగ్‌బ్యాంగ్' మహా పేలుడు సిద్ధాంతమే 1920 దశకంలో దీన్ని ప్రతిపాదించారు. ఈ సిద్ధాంతము ప్రకారం, విశ్వంలో సుమారు 1500 కోట్ల కాంతి సంవత్సరాల క్రితం పెద్ద ప్రేలుడు (బిగ్‌బ్యాంగ్) సంభవించింది. అంత వరకు అనూహ్య శక్తి సాంద్రతలో అతి సూక్ష్మ రూపంలో ఉండిన పదార్థము. వామనుడు త్రివిక్రముడయినట్లు అన్ని దిశలుగా విస్తరించసాగింది. ఈ విస్తీర్ణత సాగుతుండగనే 'శక్తి అక్కడక్కడ మొదట 'రేణువుల రూపములో తరువాత 'వాయుఅణు' రూపంలో కేంద్రీకృతం కాసాగింది. ఈ విధముగా కోట్లు సంవత్సరాల కాలంలో నక్షత్రాలుగా, నక్షత్ర మండలాలుగా, గ్రహాలుగా రూపొందిందని బిగ్‌బ్యాంగ్ సిద్ధాంతం వివరణ. ఒకవేళ ఆ సిద్ధాంతము నిజమే అయితే, బిగ్‌బ్యాంగ్ కాలం నాటికో ఆ తర్వాత కాలానికో సంబంధించిన 'శక్తి' అవశేషాలు వేరే రూపం కానవచ్చి తీరాలని శాస్త్రజ్ఞులు, ఆరా తీయటం మొదలుపెట్టారు. బిగ్‌బ్యాంగ్ అవశేషాలు కోసం అన్వేషణం అంటే గతంలోనికి వెళ్లటమే లేదా విశ్వం అంచులకు వెళ్లడమే.

అంత పురాతనమైన అవశేషాలు విశ్వంలో దొరకటం సాధ్యమేనా? అని శాస్త్రజ్ఞులు సందేహంలో పడ్డమాట నిజమే, తొలిసారిగా 1964లో బిగ్‌బ్యాంగ్ సిద్ధాంతానికి బలం చేకూర్చే అంశాల్ని, ఎ. పెంజియాస్, రాబర్ట్ డబ్ల్యు, విల్సన్ అనే శాస్త్రజ్ఞులు గుర్తించగలిగారు. వాళ్లు బిగ్‌బ్యాంగ్ తరువాత కాలానికి చెందిన 'కాంతి' అవశేషాలు (ఆఫ్టర్ గ్లో) ను గుర్తించారు. ఇది మెరుపు మెరిసిన తర్వాత ఆకాశంలో మిగిలే కాంతి లాంటిదని భావించవచ్చు. బిగ్ బ్యాంగ్ సిద్ధాంతము ప్రకారం అనంతమైన ఉష్ణోగ్రత ఫలితమే ఈ తొలి కాంతి. ఆ తరువాత 'విశ్వం' క్రమంగా చల్లారసాగింది. అలనాడు కాంతి ఇప్పుడు అతి తక్కువ శక్తి కలిగిన రేడియోవేవ్ రీజియన్ లోనే నిక్షిప్తమయి ఉంది. ఆ కాంతినే తాము గుర్తించినట్లు పెంజియాన్, విల్సాన్‌లు ప్రకటించారు.

**15వ అధ్యాయము :**

బిగ్‌బ్యాంగ్ అనంతరము విశ్వమంతా ఒకే పద్ధతిలో శక్తి వ్యాపించి, తర్వాత ముద్దలు (నక్షత్రాలు - గ్రహాలు)గా మారి ఉంటుందని భావిస్తే, శక్తి ముద్దలుగా ఎలా రూపొందిందనేది ప్రశ్న ? 'కోబ్' అందించిన సమాచారం ఈ ప్రశ్నకు సమాధాన మివ్వగలదని నాసా శాస్త్రజ్ఞులు అంటున్నారు. వీరి అభిప్రాయం ప్రకారం బిగ్‌బ్యాంగ్ అనంతరము విశ్వశక్తి వ్యాపిస్తున్నప్పుడే పలు సూక్ష్మమైన 'అలలు' తలెత్తాయి. నిజానికి ఈ అలలన్నీ పదార్థముగా ఘనీభవిస్తున్న శక్తికి ప్రతిరూపాలేనని అంటున్నారు. ఇలా అలలు రూపొందాక, విశ్వ కర్షణ శక్తి వల్ల మరింత పదార్థము వచ్చి చేరడం జరిగింది. చివరికి నక్షత్ర మండలాల్లో, నక్షత్రాలు ఏర్పడ్డాయి అని వివరణ. అప్పటి అలలను నేడు మనం కోబ్ పంపుతున్న మైక్రో వెల్ ది పరైన్షియల్ రూపంలో పొందుతున్నాము. అంటే - విశ్వం తొలినాళ్లలో తలెత్తిన అలల ఆచూకీ నేటికి మనకు కనిపిస్తుందన్నమాట. ఆనాటి నుంచి విశ్వంలో ప్రయాణిస్తున్న అలల నుంచి రేడియో తరంగాలు భూగోళానికి నేటికి చేతున్నాయన్నామాట. 'కోబ్' ఉపగ్రహం పరిశీలన శక్తి అమోఘము 1989లో దీన్ని ప్రయోగించారు. మానవ రహిత 'డెల్టా' రాకెట్ ద్వారా రోదసిలోకి జేరిన ఈ ఉపగ్రహం ఇప్పటికి కొన్ని లక్షల కొలతలు తీసుకొని వాటిని భూమ్మీద కేంద్రాలకు అందజేసింది. వ్యోమనౌకలోని ఒక పరికరం నాటి అలల నుంచి వస్తున్న రేడియో రంగాలలోని ఉష్ణోగ్రతలో సూక్ష్మ వ్యత్యాసాలను సైతం గుర్తించింది. అసలీ ఉష్ణోగ్రతే, అబ్సొల్యూట్ జీరోకు 2.73 డిగ్రీలు ఎక్కువ. అందులో వ్యత్యాసాలు గుర్తించుట మంటే మరీ కష్టం. ఒక డిగ్రీలో మూడు కోట్ల వంతులు మాత్రమే ఉండే ఈ వ్యత్యాసమే. విశ్వావిర్భావ కాలంలో పదార్థ సాంద్రతలో తేడాలకు ప్రతీక అని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. అయితే ఇంతటి చిన్న తేడాల కారణంగా ఉత్పన్నమయే ఆకర్షణ వల్ల పదార్థము నక్షత్ర మండలాలుగా, నక్షత్రములుగా రూపొందకపోవచ్చు. దానికి బదులు విశ్వంలో కానరాని పదార్థం ఎంతో ఉందని మామూలు పదార్థానికి

భిన్న లక్షణాలు కలిగిన ఆ 'డార్క్-మేటర్' వలే నక్షత్ర మండలాలు నక్షత్రాలు ఏర్పడి ఉండవచ్చుచనని అభిప్రాయం. విశ్వంలో 90 శాతం ఈ డార్క్ మీటార్ కావచ్చు. ఇప్పుడు కోబ్ అందజేసిన సమాచారం ఈ డార్క్-మెటర్ సిద్ధాంతానికి అనుగుణంగానే వున్నది.

**16వ అధ్యాయము :**

కోబ్ ఉపగ్రం పంపిన సమాచారం ఆధారంగా రూపొందించిన తొలి మైక్రోవేవ్ (న్యూక్లి అలల) మ్యాప్ శాస్త్రజ్ఞులకు పెద్దగా ఉపయోగం లేదు. పలురకాల మైక్రో వేవ్స్ బిగ్‌బ్యాంగ్·కాలం నాటి మైక్రోవేవ్స్‌లో కలగలసిపోవడము దానికి కారణం. కంప్యూటర్ విశ్లేషణలో జరిపిన తరువాత ఏడాది కాలానికి సిద్ధమైన, డి. ఎం. ఆర్. మ్యాప్ బిగ్‌బ్యాంగ్ సిద్ధాంతానికి కొత్త ఊపిరి లూదింది. ఎక్కువ ఉష్ణోగ్రత వ్యత్యాసం ఉన్న ప్రాంతాలన్నీ నేటి కి నక్షత్ర మండలాలుగా మారిపోయి ఉంటాయి. 1990లో శాస్త్రజ్ఞులు గుర్తించిన నక్షత్ర మండలాల, ఖగోళ, మహాకుధ్యం కన్నా పెద్దవైన 'ప్యాచెస్' సైతం కోబ్ మ్యాప్‌లో చోటు చేసుకున్నాయి. పెద్ద విశేషాలు సరే, అతి సూక్ష్మశాలను గుర్తించాలన్నదే ఖగోళశాస్త్రజ్ఞుల ఆకాంక్ష, ఇలాటి విశేషాలు దక్షిణ ధ్రువ ప్రాంతంలో, 'స్ట్రాటోస్ఫియర్' వాతావరణంలో అత్యున్నత పొరలో జరుగుతున్న పరిశోధనల వల్ల తెలిసే అవకాశం ఉందని అంటున్నారు.

అతి చిన్న 'హాట్ స్పాట్' సైతం తామూహించినట్లే ఉండే అది ఇన్‌ఫ్లేషనరీ యూనివర్స్ థియోరి అనే మరో ఖగోళసిద్ధాంతానికి ఊపిరి పోస్తుంది. ఇది బిగ్‌బ్యాంగ్ సిద్ధాంతానికే ఊతం ఇస్తుంది.

**17వ అధ్యాయము :**

ఈ సిద్ధాంతం ప్రకారం - యాంటీ గ్రావిటీ ఫలితంగా విశ్వం కేవలం ఒక సెకను కన్న అతి తక్కువ సమయంలో కొన్ని కోట్లు, కోట్లు, కోట్లు, కోట్లు, రెట్లు

విస్తరించి ఉంటుంది. ఆ చర్య ఆశ్చర్యంగా అనిపించినా, పార్టికల్ ఫిజిక్స్ సూత్రాల ప్రకారం, అది సాధ్యమే, ఈ సిద్ధాంతాన్ని ఆమోదిస్తే విశ్వం తొలినాళ్లలో వేడి చల్లని ప్రాంతాలన్నీ ఒక పద్ధతి ప్రకారం ఉండాలి, కోబ్ అందిస్తున్న సమాచారం, ఈ ఊహకు అనుగుణంగా ఉండటం విశేషం, ఎలా చూసినా కోబ్ అందిస్తున్న రేడియో వేవ్ దృశ్యం, బిగ్‌బ్యాంగ్ సిద్ధాంతానికి జనజీవాలు కలపిస్తోందని శాస్త్రజ్ఞుల ఉవాచ.

బిగ్‌బ్యాంగ్ సిద్ధాంతం ప్రకారం - అతి సూక్ష్మ రూపం నుంచి విశ్వవిస్తరణ కొనసాగుతోంది. ఈ విస్తరణ ఎంత వరకనేది ప్రశ్న. విశ్వ పదార్థం మధ్య సాంద్రత బాగా తగ్గిపోతే, ఆకర్షణ శక్తి బలహీనమై మొదట కేంద్రీకరణ నెమ్మదవుతుంది. ఆ తరువాత వ్యవహారం పూర్తి వ్యతిరేక దిశలో సాగుతుంది. అంటే విశ్వం ఒక సారిగా కుప్పకూలుతుంది. అలా కాకుండా విశ్వంలో సాంద్రత తగ్గ మోతాదులోనే ఉన్నట్లయితే విస్తరణ అలా కొనసాగుతూనే ఉంటుంది. కోబ్ అందించిన సమాచారం, ఈ విషయంలోనూ ఉపశమనాన్నే ఇస్తోంది. విశ్వం ఇప్పుడు తగిన సాంద్రతతోనే ఉంది, కనిపిస్తున్న నక్షత్ర మండలాలు, నక్షత్రాలన్నీ కలిసినా, ఈ సాంద్రతలో ఒకటి శాతం మాత్రమే అవుతాయా? మిగిలినదంతా 'డార్క్ మేటర్' రూపంలోనే ఉంటుందని శాస్త్రజ్ఞుల భావన. డార్క్‌మేటర్ ఏది, ఎక్కడుందీ అనే పరిశోధనలింకా కొనసాగుతూనే ఉన్నాయి. బహుశ ఆ డార్క్‌మేటర్ న్యూట్రీన్‌ల రూపంలోనో, లేదా ఇప్పటికీ శాస్త్రజ్ఞుల ఊహల్లో ఉన్న వింప్స్ రూపంలోనో ఉండొచ్చు.

**18వ అధ్యాయము :**

డార్క్‌మేటర్ విషయం ఇక్కడ చూపుచున్నాము ( తేది : 23-11-1993 - ఆంధ్రజ్యోతి దినపత్రిక)

అనంత విశ్వంలో సుమారు 90 శాతంగా వున్నదని విశ్వసిస్తున్న నిగూఢమైన, అగోచరమైన ద్రవ్యరాశికి సంబంధించిన తొలి రుజువునకు కనుగొనగలిగినట్లు, రెండు ఖగోళ శాస్త్రజ్ఞుల బృందాలు పేర్కొంటున్నాయి.

రెండు వేల కోట్ల సంవత్సరాల క్రితం ఒక పెద్ద ప్రేలుడు బిగ్‌బ్యాంగ్ వల్ల ఈ అనంత విశ్వం రూపుదిద్దుకున్నందన్నది శాస్త్రజ్ఞుల అభిప్రాయం. ఆ ప్రేలుడు వల్లే ఈ అనంత విశ్వం క్రమంగా రూపొందింది. అలా రూపొందిన మొత్తం 'పదార్థం'లో ఇప్పుడు మన కంటికి కనిపిస్తున్నది కేవలం ఒక శాతం పదార్థం మాత్రమేనని, ఇంకా 99 శాతం పదార్థం కంటికి కనిపించకుండా వుంటున్నదని శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. టెలిస్కోపుకు సయితం కనబడని ఆ ద్రవ్యరాశికి 'డార్క్‌మేటర్' అని నామకరణం చేశారు.

## 19వ అధ్యాయము :

ఇటలీలో ఆ మధ్య జరిగిన రెండు అంతర్జాతీయ సమావేశాలో ఆ ఖగోళ శాస్త్రజ్ఞులు తమ పరిశోధనా ఫలితాలను ప్రకటించారు. అనంత విశ్వంలో వున్నదని విశ్వసిస్తున్న డార్క్‌మేటర్‌లో కనీసం కొంత భాగం గోధుమ రంగులో వుంది. వామన తరాలుగా పిలువబడే కాంతి హీనమైన చిన్న చిన్న నక్షత్రాలుగానో, లేక బుధగ్రహం పరిమాణమంతటి వస్తువులలోనే వుంది వుండవచ్చునన్న రుజువు సంపాదించినట్టు వారు పేర్కొన్నారు.

## 20వ అధ్యాయము :

మాసివ్ కాంపాక్ట్ హెలో 'అబ్జెక్ట్స్' లేక 'మాచో' లని పిలిచే ఆ సమూహాలు కిరణ ప్రసారాలను కలిగిలేనందున వాటిని ప్రత్యక్ష పరిశీలనలో చూడలేము. అయితే మాచోలకు అతి దీర్ఘమైన గురుత్వాకర్షణ క్షేత్రాలున్నందున, వాటిని పరోక్షంగా కనిపెట్టవచ్చు. శాస్త్రజ్ఞుల బృందాలు ఈ పద్ధతిలోనే ద్రవ్యరాశి ఉనికిని కనుగొనగలిగాయి.

**21వ అధ్యాయము :**

భూమి మీద ప్రయోగశాలలో విశ్వం సృష్టికి - ప్రతి సృష్టి : పుట **41.**
(ఈనాడు దినపత్రిక ది. 17-5-1992) రా - పి.యస్. రావు.

బిగ్‌బ్యాంగ్ నాటి పరిస్థితులు అంచనా వేయటానికి వీలుగా అమెరికాలోని ఇంధన శాఖ ఒక ప్రయత్నం చేపట్టింది. కాలాన్ని వెనక్కి తిప్పుతూ, జీరోటైమ్ స్థితికి చేరడం ఈ ప్రయత్నం లక్ష్యం, అమెరికా లాంగ్ ఐలాండ్‌లోని రెండున్నర మైళ్ల పొడుగు పెద్ద సొరంగంలో 'రిలేటివిస్టక్ - హెవీ ఆయన్ కొలడైర్' 'రిక్' పేరుతో ఒక యంత్రాన్ని సిద్ధం చేస్తున్నారు. బ్రూక్ హేవన్ నేషనల్ లేబరేటరీ శాస్త్రజ్ఞులు రూపొందిస్తున్న ఈ 'రిక్' మాత్రం నిజానికో పెద్ద యాక్సిలేటర్, రిక్‌లో భార అణువుల న్యూక్లియన్స్‌లను వేగవంతం చేసే వీలుంటుంది. ఉదాహరణకు బంగారం అణువుల్లోని 79 ఎలక్ట్రాన్ అను తొలగిస్తారు. మిగిలిన 79 ప్రోటాన్ల 118 న్యూట్రాన్లలో ఉండే బంగారం, ఈ ఆక్సిలేటర్‌లో ఆయాన్లు, ఒక దానినొకటి 40 ట్రిలియన్ ఎలక్ట్రాన్ వోల్టుల గల శక్తితో ఢీకొని, విచ్ఛిన్నమవుతాయి. అలా విచ్ఛిన్నమవుతున్నప్పుడు ఏర్పడ్డ శూన్య ప్రదేశంలో కూడా, ఈ అయాన్లు, ప్రయాణించగలుగుతాయి. ఫలితంగా పలు ''గ్లూయాన్స్'' ఉద్భవిస్తాయని క్వాంటమ్ క్రోమోడైన మిక్స్ సిద్ధాంతం వివరిస్తోంది.

**22వ అధ్యాయము :**

ప్రాధికమైన ఈ 'గ్లూయాన్స్' బిగ్‌బ్యాంగ్ తర్వాత తొలి క్షణంలో ఏలా విశ్వంలో కదలాడాయెూ అలాగే ఆ క్షణాల్లో కదలాడతాయని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. 'రిక్' ప్రాజెక్టుకు నాయకత్వం వహిస్తున్న ప్రముఖ జపనీస్ శాస్త్రజ్ఞుడు డాక్టర్ 'నటాషీ జాకీ' చెప్తున్నదాన్నిబట్టి బంగారం ఆయాన్లు ఢీకొన్న దరిమిలా రూపొందే క్వార్క్‌లను, గ్లూయాన్లను వేర్వేరుగా పరిశీలించే వీలుంది. సాధారణంగా అవి రెండు కలిసే ఉంటాయి. వేర్వేరుగా కదిలే క్వార్క్ - గ్లూయాన్‌ల కలయిక, బిగ్‌బ్యాంగ్‌తొలి క్షణంలో విశ్వంలో ఉన్న క్వార్క్ - గ్లూయాన్ - ప్లాస్మాను పోలి వుంటుందని ఓజాకీ అంటున్నారు.

బిగ్‌బ్యాంగ్ తర్వాత కేవలం ఒక సెకన్‌లో లక్ష వంతు సమయం మాత్రమే 'ఫాస్మా' అలా వుండి ఉంటుంది. కానీ ఇప్పటికీ అలాటి ప్లాస్మా - న్యూట్రాన్ - నక్షత్రాల మధ్య వుండి వుంటుందని కొందరు శాస్త్రజ్ఞులు అంటున్నారు. అలాటి ఉష్ణోగ్రత, ఇతర పరిస్థితులను గుర్తించగలమని ఓజాకీ ఆశాభావం. అంటే ప్రయోగశాలలోని విశ్వావిర్భావ కాలం నాటి పరిస్థితులను సృష్టించడము అన్నమాటే, ఈ ప్రయత్నాలే సఫలమయితే విశ్వావిర్భావ రహస్యాలన్నీ తేటతెల్లమవుతాయి.

**5.వ ప్రకరణము - సృష్టి ఉద్భవము**

**1వ అధ్యాయము**

ఈ సృష్టికి పూర్వము కాలగర్భము (నల్లటి) చీకటితో కమ్ముకొనియున్నట్లు, మొదటి పుటలోనే వివరింపబడినది. ఇదియునుగాక ఉపనిషత్తుల నుండి, పాతంజలి యోగ శాస్త్రము, మనుస్మృతి, వైశేషిక దర్శనము, ఛార్లెస్ సిద్ధాంతము మరియు విశ్వావిర్భావ సిద్ధాంతము అనగా బిగ్‌బ్యాంగ్ సిద్ధాంతము నుండియు కనబడినది చీకటియో మొదటి నుండి యున్నది. పంచ భూతములు సైతము, ఏవియు లేవని తెలిసినది. సృష్ట్యాదిలో మొదట అగ్ని సంభవించినదని, ఉపనిషత్తులు పై చూపిన గ్రంథములు గూడ చూపినవి. కాని ఛార్లెస్ డార్విన్ సిద్ధాంతములో, మొదట భూమి నుండి అగ్ని వ్యుద్భవమైనదని వివరింపబడినది. ఇది ఎంతవరకు నిజము? అగ్ని ఉద్భవించక పూర్వము ఏమియు లేదనియు మరి భూమి ఎక్కడ నుండి ఉద్భవించినదనియే ప్రశ్న ? తరువాత విశ్వావిర్భావ సిద్ధాంతములో మొదటి అగ్ని ఉద్భవించినదని చూపినారు. మరియు 'కోబ్' ఉపగ్రహములో (ఛాయలు) లేక చిత్రాలు తీసినదని, దాని మూలంగా విశ్వంలోని పదార్థాలు, ఇతరత్రా విషయాలను క్రోడీకరించిన విషయం మీకు చూపనైనది. ఇంక పరిశీలించవలసి యున్నదని వారి అభిప్రాయం.

నిజముగా 'అగ్ని' ఎట్లు ఉద్భవము జరిగినది శాస్త్రజ్ఞులు ఎవరును చూపలేదు. సృష్టికి పూర్వము అంధకారము గలిగియుండెనని చెప్పడము సహజమే, కాని అగ్ని ఏలా ఉద్భవించినది యనేది మనము ఇక్కడ తెలుసుకోవలెను.

## 2వ అధ్యాయము

సృష్టికి పూర్వము అనగా 'అగ్ని' ఉద్భవించక పూర్వము, అంధకారం లేక శూన్యంలో రెండు పదార్థములున్నవి. అవియే అణు పదార్థము - ఇవి కోడి గ్రుడ్డు ఆకారముతోను అందులో నైట్రోజన్, ప్రోటాన్లు, న్యూట్రాన్లు, లేక హైడ్రోజన్ వంటి పదార్థములతో 'అణు' నిండియున్నవి. ఈ రెండు అణు పదార్థములు ఒక దాని దగ్గర నొకటిగా చేరుకున్నవి. కాని విస్ఫోటము కాజాలలేదు. వాటిని కదిలించే వరకు విస్ఫోటన కాజాలదు. ఈ కదలించుటకు, ఋగ్వేదములో మంత్రము మనకు దొరికినది.

**మంత్రము :**

ఓం హిరణ్య గర్భ సమవర్తతాగ్రే - భూత స్యజాతః పతిరేక ఆసీత్ - అని యున్నది. దీని యర్థము పలు విధములుగా పండితులు చూపినారు ( హిరణ్య అనగా బంగారు వర్ణముతో నుండునట్లు, గర్భ ఉద్భవించినట్లు తనకు తానే అగ్నిరూపముతో ఉద్భవించినది. దీనికి కదలిక 'భూతస్య' అనునది ఒక మహత్తర శక్తితో ఆ రెండు అణు పదార్థములను ఢీకొనుట వలన హిరణ్య గర్భము అనగా అగ్ని ఉద్భవించినదనియని అర్థము.

అగ్ని నుండి వాయువు ఏర్పడినది. అందుండి మేఘము, అందుండి వర్షము లేక జలము ఏర్పడినది. ఆ జలముతో అగ్ని చల్లారి, బూడిద మాదిరిగా ఏర్పడినది. దీనినే 'భూమి' యని చెప్పుదుము. తరువాత ఆకాశము కూడా కనబడుచున్నది.

ఇది పంచ భూతములు అనగా అగ్ని వాయువు, జలము, భూమి, ఆకాశము అనునవి. అగ్ని పెద్ద ఎత్తున వెదజల్లడము వల్ల, సూర్యుడు ఏర్పడెను. కొన్ని

ప్రకాశవంతమైన చుక్కలు గూడ ఏర్పడినవి. అగ్నిగోళముతోపాటు కొన్ని భూ ఆకారముతో గోళములు ఏర్పడినవి. చంద్ర గోళము, శుక్రగోళము అనునవి ఏడు గోళములు మనకు కనబడుచున్నవి. భూమి యందు కూడ ఏడు భూమండలములున్నాయని మొత్తము (14) పదునాలుగు లోకములన్నవని ఐతరేయ బ్రాహ్మణమున చెప్పబడినది.

ఇక్కడ మనకు సరిక్రొత్త విషయము దొరికినది. విజ్ఞానవంతులైన శాస్త్రజ్ఞులు కేంబ్రిడ్జ్ యూనివర్సిటీ, ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఆస్ట్రానమీకి చెందిన అలెక్ బోక్సెంబర్గు అంటున్నారు. విశ్వమూలాలపై కొత్త వెలుగు, అను శీర్షికలో హబుల్ అను టెలిస్కోప్ ద్వారా ఈ విషయమును మును ఎన్నడూ లేనంతగా అనుభవానికి వస్తున్నది.

పై చూపిన సృష్టి క్రమము 5వ ప్రకరణము 2వ అధ్యాయమున చూపిన 'అణు' పదార్థము విస్పోట్ ఏ విధముగా అయినది చూపినాము. దానికి నిదర్శనము ఈ విధముగా యున్నది. అలెక్ బోక్సెంబర్గ్ గారు అనడం, ఈ థీమాతోనే అయితే, బిగ్‌బ్యాంగ్ థియోరీ అనేది ఈ థీమాకు అసలు మూలం మొదట విశ్వమంత శూన్యంలో ఒక చిన్న 'అణువు' అందులో మహా విస్పోటనం జరిగి పదార్థం విస్తరించడం మొదలైంది. ఆ విస్తరణ క్రమంతో రూపొందినవే అన్ని రకాల గ్రహ గోళాలున్నూ, గెలాక్సీలు ఏర్పడినట్లు కనుక్కోబడినది. ఇది మేము పై చూపిన సృష్టి ఉద్భవమునకు ఋజువు - నాంది పలికింది.

- ఈనాడు దినపత్రిక తేది : 3 -7 - 1996.

దీని వివరణ ఈ క్రింద నుదహరించబడును.

**విశ్వమూలాలపై కొత్త వెలుగు : హబుల్**

విశ్వాంతరాళంలో నుదరాన్ని చూడగలగడమేంటే, కోట్ల సంవత్సరాలు వెనక్కి వెళ్ళి అప్పుడు ఏమి జరిగిందో చూడడమే. ఈ సంగతి మనిషికి, శాస్త్రజ్ఞులకు చిరకాలంగా తెలిసిన విషయమే. హబుల్ టెలిస్కోపు ద్వారా ఆ విషయం మునుపెన్నడూ లేనంతగా

అనుభవమునకు వస్తున్నది. అది ఎంతగా అనుభవానికి వస్తున్నదంటే, మరి మూడేళ్ళలో విశ్వావిర్భావం తొలినాటి దృశ్యాల్ని చూడ గలుగుతామని, విశ్వం వయసెంతో నిర్ధారించగలుగుతామని కేంబ్రిడ్జి యూనివర్సిటీ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఆస్ట్రొనమీక్ చెందిన అలెక్ బోక్సెం బర్గ్ అంటున్నారు. సుదూర విశ్వంలోనికి వెళ్ళిపోయి, అక్కడి నుంచి తాను అందుకున్న సమాచారాన్ని దృశ్యాలను భూమికి అందిస్తోంది. హబూల్ టెలిస్కోపు ఈ సమాచారాన్ని విశ్లేషించి, విశ్వ రహస్యాన్ని విప్పి చెప్పడం కోసం శాస్త్రజ్ఞుల పలు బృందాలు పనిచేస్తున్నాయి. ముఖ్యంగా హబుల్ టెలిస్కోపు ఇటీవల పంపిన దృశ్యాలు శాస్త్రజ్ఞులను సంభ్రమాశ్చర్యాలకు గురి చేశాయి. ఇన్నాళ్ళు అక్కడ ఏమీలేదు, ఉత్తి శూన్యం అని భావించిన విశ్వ ప్రాంతాన్ని హబుల్ కంటితో చూస్తే, అది ఉత్తి శూన్యం కాదని, అక్కడ చాలా తక్కువ వయసుగల గెలాక్సీ (నక్షత్ర) రాసులున్నాయని స్పష్టమయింది, ఉన్నాయి..... అంటే ఇప్పుడు అలా ఉన్నాయని కాదు. హబుల్‌కు అందిన కాంతి ఇప్పటిది కాదు. ఆయా విశ్వ వస్తువులు హబుల్‌కు చేరడానికి కొన్ని శతకోటి కిందటిదన్నమాట. ఇప్పుడు మనకు కనిపిస్తున్న రీతిలో ఆయా వస్తువులు అన్ని శతకోటి సంవత్సరాల కిందట ఉండేవన్నమాట. అందులో కొన్ని విశ్వం పుట్టాక ఒక శతకోటి (బిలియన్) సంవత్సరాల కిందటి వస్తువులు ఇప్పుడిక హబుల్‌ను మరొక ఉత్తి శూన్యంవైపు తిప్పి చూడాలనుకుంటున్నారు. విశ్వం దక్షిణార్థగోళం నుండి హబుల్ డీప్ ఫీల్డ్ అనే కొలతను ఉపయోగించి దృశ్యాలను సేకరిస్తారు. మరిన్ని యంగ్ గెలాక్సీలు (తక్కువ వయస్సు నక్షత్ర రాశులు) హబుల్ ద్వారా శాస్త్రజ్ఞులకు చేరిపోతాయి. విశ్వావిర్భావపు శతకోటి సంవత్సరాల వయోరూపాన్ని చూడగలుగుతున్నారంటే, ఆ శతకోటి సంవత్సరాల వ్యత్యాసాన్ని అధిగమించడానికి ఇంకెంతో కాలం పట్టదని భావించవచ్చు. మరి మూడేళ్ళ విశ్వం వయసు నిర్ధారించగలమని అలెక్ బోక్సెంబర్గ్ గారు అనడం ఈ ధీమాతోనే, అయితే, బిగ్‌బ్యాంగ్ - థియరీ అనేది ఈ ధీమాకు అసలు మూలం. మునుమ్మొదట విశ్వమంతా

శూన్యం అనదగిన ఒక చిన్న అణువు, అందులో మహా విస్ఫోటనం జరిగి పదార్థం విస్తరించడం మొదలయింది. ఆ విస్తరణ క్రమంలో రూపొందినవే అన్ని రకాల గ్రహగోళాలున్నూ, ఈ సిద్ధాంతం ప్రకారం నేటికి విశ్వం వయస్సు 9 నుండి 15 శతకోటి సంవత్సరాలు ఉండవచ్చని అంచనా. కాని, అంతకన్నా ఎక్కువ వయసున్న నక్షత్రాలు కొన్ని ఇటీవల శాస్త్రజ్ఞులకు తెలిసి వచ్చాయి. హబుల్ టెలిస్కోపు శాస్త్రజ్ఞుల దృష్టిని ఇప్పటికే చాల విస్తరించింది. ఇంకా విస్తరిస్తుంది. ఆ ఒక శతకోటి సంవత్సరాల వ్యత్యాసాన్ని అధిగమించి, ఆ తొలినాటి పదార్థాన్ని చూడడం నిజంగానే సాధ్యమా ? ఇంతాచేసి మహావేలుడు సిద్ధాంతం సమగ్రమేనా? సరి అయినదేనా? ఈ సిద్ధాంతం ఒప్పనో, తప్పనో హబుల్ రుజువుచేస్తుందా? అది సాధ్యమయితే, మిగిలిన విషయాల సంగతేమయినా శాస్త్ర విజ్ఞానంలోనే అదొక మూలమలుపు అవుతుందనే మాట మాత్రం నిజం.

1) సూర్యగోళము 2) చంద్రగోళము, 3) శుక్రగోళము, 4) కుజగోళము, 5) బుధగోళము, 6) గురు గోళము, 7) శని గోళములు యిప్పుడు శాస్త్ర విజ్ఞానవేత్తలు అయిన (అమెరికా దేశము విజ్ఞానము) ఉపగ్రహము ద్వారా చంద్ర మండలమునకు పోయి వచ్చిరి. వారిలోని కెప్టెన్ శ్రీ ఆర్మస్ట్రాంగ్ ముఖ్యుడు.

మరి రష్యా దేశ విజ్ఞానాలు శుక్రమండలమునకు పోయివచ్చిరి. వారిలోను భారతదేశములోని హైదరాబాదు నివాసియైన శ్రీ రాకేశ్ శర్మగారు యుండిరి. మరియు ఇతర గ్రహాల్లోకి పోవుటకు ప్రయత్నం జరుగుచున్నది. ఈ గోళములకు ఏడుగురి ఋషుల పేర్లు పెట్టిరి.

ఇక్కడ మనకు అగ్ని మొదలు కనబడుచున్నది, అగ్గి నుండి పొగ మాదిరిగా వచ్చేది వాయువు, కనపడుచున్నది, వాయువు నుండి మేఘము ఏర్పడును, ఆ మేఘము వర్షరూపమున జలముద్భవించును. ఆ జలము పడినతోడనే అగ్ని చల్లారి బూడిదగా

కనబడుచున్నది అదియే భూమి. ఆ భూమి చుట్టు జలము ఉండుటవలన, అనగా భూమి జలమును లాగుకొని ఔషధములనుద్భవించును, అనగా చెట్లు, చేమ, గడ్డి అను పదార్థములు ఏర్పడినవి. దానినే ప్రకృతియని చెప్పుదురు. ఈ ప్రకృతి సంపద నుండియే మనకు తిను పదార్థములు ఉత్పత్తి చేయుచున్నాము మరియు భుజించుచున్నాము. కనుక సృష్టికి పూర్వము అణు పదార్థములు నుండెడవని - వాటి వల్ల అగ్ని, వాయువు, జలము, భూమి, ఆకాశము ఏర్పడినదనియు తెలియడమైనది. ఈ పంచభూతముల నుండి ప్రకృతి ఏర్పడినది, ప్రకృతి నుండి ప్రాణులేర్పడినది, దీనికి పూర్వము, ఒక శరీరం ఏర్పడినది (ఈ శరీరమునుకు - నాసికము రెండు కన్నులు, రెండు చెవులు, రెండు చేతులు, రెండు కాళ్లు, నోరు, కడుపు, తొమ్మిది రంధ్రములతో ఏర్పడినది. దీని వివరము మానవజాతి జన్మమున చూపగలము, యిప్పుడు ఎక్కువ లోతుకు పోకుండా చూడవలసినది 'అణు' అణు అనగా 'అండ' యని చెప్పుదురు. ఈ అండలో పిండము ఉద్భవించును. అందుకే ఈ ప్రపంచమును - అండ - పిండ - బ్రహ్మాండమని చెప్పుదురు. ఈ అండ - పిండమను దానికి దేవి భాగవతమున గల అంశాలను ఇచట ప్రస్తావింతును.

## 3వ అధ్యాయము

### దేవి భాగవతము ---- మానవ సృష్టి

ఒక ఆదిశక్తి యుండెనని, ఆ శక్తి మూడు గుడ్లు పెట్టిందనీ, వాటి నుండి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు పుట్టారని, అమే ఆజ్ఞచే వీరు ముగ్గురు సృష్టి స్థితి లయాలకి, కారకులయ్యారనీ, దేవి భాగవతం చెప్పుతోంది. ఈ ముగ్గురిలో చివరి వాడైన శివుని, ఈమె తన భర్తగా స్వీకరించింది లేక ఎన్నుకున్నది. దీని గురించి విచారించవలసియున్నది. నీటిలో వొక బంగారం రంగుగల 'అండ' (గ్రుడ్డు) వును, మనువు ఓదిలాడని, దానిని చీల్చి పై డిప్పతో ఆకాశమునకు, క్రింద డిప్పతో భూమిని

చేసి భూమిపై నీటిని సృష్టించాడని మనుధర్మశాస్త్రంలో వ్రాయబడినది. భూమి - ఆకాశములు సృష్టించక పూర్వం నీటిని బంగారు రంగుల గ్రుడ్డును ఎవరు, ఏ విధముగా సృష్టించినదీ మనుధర్మ శాస్త్రవేత్తలు వ్రాయలేదు. చూపను లేదు.

(డార్విన్ రా. సి.వి. పుట 18)

**4వ అధ్యాయము**

ఇక్కడ ఆదిశక్తి అనగా 'భూత్' భూతము అనియు, ఆమె మొదటి ఒక గ్రుడ్డు పెట్టినట, అందుండి మనిషి ఏర్పడినాడట, అతనిని వివాహమాడమని శక్తి అడిగెనట, అందుకు అతను ఒప్పుకొనలేదు. అతనిని భస్మము చేసినదట. తరువాత రెండవ గ్రుడ్డు పెట్టెనట, అందుండి ఒక మనిషి ఆకారంతో ఏర్పడినదట, అతనిని కూడ వివాహము ఆడమని అడిగెనట, దానికి అతను అంగీకరించలేదట, అతనిని భస్మము చేసెనట. తరువాత మరల మూడవ గ్రుడ్డు పెట్టెనట, అందుండి ఒక మనిషి ఉద్భవించెనట. అతనిని కూడా తన కోరిక నెరవేర్చుమని అడిగెనట. అప్పుడు తన ప్రక్కనున్న రెండు కుప్పలను చూసి, తాను అంగీకరించెనట. కాని ఈ రెండు కుప్పల సంగతిని తెలుసుకొని, వారందరిని బ్రతికించమనియు, నీవు ఈ రూపమును వదలి మానవ రూపము ఎత్తినట్లయితే అప్పుడు నీ కోరిక నెరవేరుస్తానని అన్నాడట. అదియునుగాక, నీవు మూడు రూపములుగా జన్మనెత్తి ఈ ముగ్గురుని వివాహమాడవలెనని చెప్పినాడట. అందుకు ఆదిశక్తి అంగీకరించెనట. అప్పుడు ఆదిశక్తి తన వద్ద నున్న త్రినేత్రమును ధరించి ఆదిశక్తిని భస్మము చేసెనట. తరువాత అతనికి యిచ్చిన మంత్రము ద్వారా ఆదిశక్తిని మూడు అవతారములుగా జన్మింజచేసినట. మొదట పర్వత రాజు కూతురు పార్వతిగా, శివుడు అనగా చివరిగా ఆదిశక్తికి పుట్టినవాడు, ఆమె దగ్గర నుండి త్రినేత్రము - జన్మమును పుట్టించే మంత్రమును స్వీకరించిన వాడు, అతడే మొదటివాడుగాను, తరువాత వాడు విష్ణువు; బ్రహ్మగా

వీరిరువురికి (ఆదిశక్తి) లక్ష్మి, - సరస్వతిగాను జన్మములను ధరించెనట. ఈ విషయము ఒక అచల పరిపూర్ణ ఆధ్యాత్మిక గ్రంథమున కనబడినది.

ఇక్కడ మనము పై చూపిన విషయమును నమ్మిన నమ్మకపోయిన, మన వేదములు, ఉపనిషత్తులు మనకు చూపుచున్నవి. 'పరమాత్ముడొక్కడే'. కాని అతను అనేక రూపములతో కనబడును అన్నట్లు వైదిక సిద్ధాంతము, ముగ్గురుగా నున్నట్లు చెప్పుచున్నది. ఆ ముగ్గురు ఎవరని అడిగినట్లయితే (1) పరమ పితా పరమాత్ముడు అనగా శివుడు (2) విష్ణువు అనగా ప్రకృతి (3) బ్రహ్మ అనగా జీవుడు. ఈ ముగ్గురు సృష్టికి అధిపతులుగాను, జన్మరహితులుగాను, పూజనీయులుగాను, నమ్ముచున్నారము. పూజించుచున్నారము. ఈ ముగ్గురి గురించి మూడు విధముల సిద్ధాంతములు మరియు మతములుగా నేర్పడినది.

**5వ అధ్యాయము**

**సిద్ధాంతములు - మతములు**

(1) వైదిక సిద్ధాంతము - ద్వైతము (2) అద్వైతము 3) విశిష్ట అద్వైతము ఏర్పడినవి. ఈ మూడు ప్రస్తుత ఆచారములలో, మతముల పేరిట జరుగుచున్నవి. వీటి వివరణ తరువాత చూపగలము.

ఈ సృష్టి గురించి పై చూపిన తరువాత మనకు కనబడుచున్నది, ఏమనగా (సైన్సు) విజ్ఞానమును బట్టి చూచిన ఎడల, అంధకారముతో నున్న సమయమున 'అణు' పదార్థములు రెండు ఒక మహత్తర గల శక్తితో ఢీకొనుట వలన అగ్ని ఉద్భవించి - వెలుతురు కలిగెను. దీని విషయము మీకు ముందుగానే చూపినాము. ఈ అణు - అండ - అంటారు, దీని నుండి పిండము అనగా ప్రకృతి, బ్రహ్మాండము అనగా (జగత్) ప్రపంచము ఏర్పడినట్లు తెలుసుకున్నాము. దీనికి గురించి ఋగ్వేదము మంత్రము ఈ విధముగా చూపుచున్నది.

మంత్రం

హిరణ్య గర్భ సమవర్తతాగ్రే - భూత స్యజాతః పతిరేక ఆసీత్।

సదాధార పృథివీమ్ ధ్యాముతే మామ్ - కస్మై దేవాయ అవిశా విధేమః॥

ఈ మంత్రము యొక్క వివరణ పుట 21-5 ప్రకరణము (2) అధ్యాయమున చూపించి యున్నావము. జ్ఞానులు, విజ్ఞానులు, మఠాధిపతులు, పండితులు, యావత్ప్రజ ఈ సిద్ధాంతమును నమ్ముతారని విశ్వసించుతున్నాను.

ఈ సృష్టి ఉద్భవించి ఎంతకాలమైనది శాస్త్రజ్ఞులు, జ్యోతిష్యులు, మఠాధిపతులు చూపినది ఈ దిగువ చూపబడుచున్నది.

## 6వ అధ్యాయము

### సృష్టి ఉద్భవించిన కాలమానము

| | | |
|---|---|---|
| 1) | ఆది సృష్టి నుండి సంకల్ప సంవత్సరములు (వైదిక సంపత్) | 1972940101 సం॥లు |
| 2) | భూమి పుట్టినది - ఛార్లెస్ డార్విన్ పరిణామ సిద్ధాంతము | 450 కోట్ల సం॥లు |
| 3) | భూమిపై ఏమియు లేనిది. | 200 కోట్ల సం॥లు |
| 4) | మధ్యకాలం | 250 నుండి 50 కోట్ల సం॥లు |
| 5) | జీవులు సంచరించుకాలము | 50 నుండి 40 కోట్ల సం॥లు |
| 6) | వెన్నెముక లేని జీవులు | 40 నుండి 36 కోట్ల సం॥లు |
| 7) | వృక్షజాతులు | 36 నుండి 28 కోట్ల సం॥లు |
| 8) | అడవులు - ఉర్మిలు - బల్లులు అవతరించిన సమయం | 28 నుండి 20 కోట్ల సం॥లు |
| 9) | స్తన్య జీవులు - పక్షులు మొదలగునవి | 20 నుండి 7 1/2 కోట్ల సం॥ |
| 10) | కోతులు - చింపాంజీలు | 7 1/2 నుండి 20 లక్షల సం॥ |
| 11) | మానవులు మరియు నిప్పుకనిపెట్టినది | 20 లక్షల పూర్వం నుండి సం॥ |

- డార్విన్ పరిణామ వాదం ---

ఈ లెక్క అంత సమంజసముగా కనబడుట లేదు, మరియు ప్రపంచములోని కొన్ని సంవత్సరములు సృష్టి నుండి యిప్పటి వరకు మరియు ఇతర దేశముల యొక్క వివరములు వైదిక్ సంపత్తి నుండి చూపినవి చూపుచున్నాము.

## 7వ అధ్యాయము

## సృష్టి ఉద్భవించిన జ్యోతిష్ కాలమానము

| | | | |
|---|---|---|---|
| 1) | ఆది సృష్టి నుండి సంకల్ప సంవత్సరములు | : | 1972940104 సంవత్సరములు |
| 2). | వైవస్వత్‌మను నుండి ఆర్య సంవత్సరములు | : | 120533104 |
| 3) | చీనీయులు (చైన) ప్రథమ రాజు నుండి దీని సంవత్సరములు | : | 960024364 |
| 4) | ఖతాయొక్క ప్రథమ పురుషుడు నుండి ఖతాయి సంవత్సరములు | : | 884104 |
| 5) | పృధ్వి ఉత్పత్తి యొక్క చాల్డిషియన్ సంవత్సరములు | : | 21500024 |
| 6) | జ్యోతిష విషయము యొక్క చాల్డిషియన్ సంవత్సరములు | : | 4200074 |
| 7) | ఈరాన్ యొక్క ప్రథమ రాజు నుండి సంవత్సరములు | : | 189982 |
| 8) | ఆర్యులు ఫినిషియా పోయినప్పటి నుండి ఫినిషియన్ సం॥లు | : | 300704 |
| 9) | ఈజిప్టులు పోయినప్పటి నుండి ఈజిప్టియన్ సంవత్సరములు | : | 28585 |
| 10) | విశేశ ఘటన నుండి ఇబ్రానియన్ సంవత్సరములు | : | 594203 |
| 11) | కలి ఆరంభము నుండి కలియుగ సంవత్సరములు | : | 5033 |
| 12) | యుధిష్టర్ ప్రథమ రాజు అయినప్పటి నుండి యధిష్టర సం॥లు | : | 4088 |

| | | | |
|---|---|---|---|
| 13) | మూసా ధర్మ ప్రచారము యొక్క నుండి మూసాయి సం॥లు | : | 3499 |
| 14) | ఈ సా జన్మదినము నుండి ఈసాయి సంవత్సరములు | : | 1997 |
| 15) | మొగస్తానీయులు యొక్క వంశము సంవత్సరములు | : | 90,003 |
| 16) | మిశ్రవారే పోయిన నుండి సంవత్సరములు | : | 285815 |
| 17) | జ్యోతిషా శాస్త్ర - సృష్ట్యాది శత సౌరాబ్దాః సం॥లు | : | 1955885097 |
| 18) | వర్తమాన మహాయుగ శతాబ్ద సం॥లు | : | 389796 |
| 19) | కల్యాది శతాబ్ద సంవత్సరములు | : | 5097 |
| 20) | శాలివాహన శతాబ్దము సంవత్సరములు | : | 1918 |
| 21) | హణుల శక శతాబ్దము సంవత్సరములు | : | 1997 |
| 22) | ఇక్కడి విజ్ఞాన శాస్త్రజ్ఞులు చూపిన సృష్ట్యాది విశ్వావిర్భావ సిద్ధాంతము చూపినది - సంవత్సరములు ( ఈనాడు పత్రిక) | : | 1500 కోట్లు |
| 23) | ఛార్లెస్ డార్విన్ పరిణామవాదం నుండి చూపినది భూమి పుట్టినది సంవత్సరములు | : | 450 కోట్లు |
| 24) | విశ్వ రహస్య పేటిక ( డార్క్-మేటర్) శాస్త్రజ్ఞులు చూపినది సృష్టి ఆరంభము | : | 2000 కోట్లు |

( ఆంధ్రజ్యోతి పత్రిక నుండి కనబడినది)

**8వ అధ్యాయము**

ఇక్కడ మనము సృష్ట్యాది సంవత్సరములు గురించి చూచినాము. కాని ఒక దానికన్నా ఒకటి కలువలేదు. మరియు వైదిక సంపత్తిలో చూపిన సృష్ట్యాది సంవత్సరములు 1972940104. మరియు జ్యోతిష్యాది పంచాంగ గుణిత సంవత్సరములు 1955885097 మరియు ఇదియును గాక సృష్టి మూలమును గురించి ఇటలీలో, ఆ మధ్య జరిగిన రెండు అంతర్జాతీయ సమావేశములో 'మాచో' అని

పిలిచే ఆ సమూహాలు, కిరణ ప్రసారాలను కలిగి లేనందున వాటిని ప్రత్యక్ష పరిశీలనలో చూడలేము. కనుక (సెటలైట్) కోబ్ ఛాయ గ్రహముతో గాని మరి ఏ పరికరములతో భూమి యొక్క ఆకారము క్రింది భాగమును కనుగొన్ననాడు సృష్టి మూలమును తెలుసుకున్నవారమైతము.

కాని యిప్పటి వరకు అగ్ని ఏ విధముగా ప్రజ్వరిల్లినది శాస్త్రజ్ఞులు సైతము చూపలేదు. పరిశీలించి చెప్పలేదు. కాని మేము చూపిన సృష్ట్యాది మూలము ఏ విధముగా అగ్ని ఉద్భవము జరిగినది (పుట 21) ఐదవ ప్రకరణము (2) అధ్యాయమున చూడుడు.

## 9వ అధ్యాయము

పై చూపిన సృష్ట్యాది ప్రారంభము నుండి నేటి వరకు చూపిన సంవత్సరములు చూచినాము. కాని యుగములననుసరించి చెప్పినది చూడవలెను.

1) యిరువది ఏడు చతుర్ యుగముల యొక్క సంవత్సరములు : 116640,00

2) సత్‌యుగము - కృతాయుగం (గోల్డెన్ ఏజ్) సంవత్సరములు : 1728000

3) అందరు ఐక్యమత్య ఆర్యులని పిలువబడిరి ఆర్య సంవత్సరములు త్రేతాయుగము - త్రేత అనగా ఈ కాలమందు అగ్ని హోమములు యజ్ఞ యాగములు చేసిన కాలము (సిల్వర్ ఏజ్) సం॥లు : 1296000

4) ద్వాపర యుగము, ద్వాపర అనగా పాప భూయిష్టమైన కాలం (సన్‌పుల్ లేక బ్రౌనేజ్ లేక కాపర్ ఏజ్) యొక్క సం॥లు : 864000

5) ఇప్పటివరకు కలియుగము - కలి అనగా కలిపురుషుడు అవతరించిన కాలము, అంతిమ కాలము (ఐరన్ ఏజ్) కలియుగము యొక్క సం॥లు : 5030

వైవ స్వత్ మను యొక్క నుండి ఇప్పటి వరకు యుగవుల యొక్క 120533101 సంవత్సరవుులు. ఇక్కడ సృష్టి నుండి నేటి వరకు చూపిన సంవత్సరములు, కోట్ల, కోట్ల, కోట్ల సంవత్సరములు. పలు విధములుగా చూపినది మీ వుుందు పెట్టినావు. నిర్ణయువు మీరు చేయుగలరు. ఇక్కడ ఎక్కువ తలదూర్చితలచుకోలేదు. ఇప్పుడు జీవులు పుట్టినది చూడవలసినది. అందులో మానవ జన్మ అతి ముఖ్యమైనది, మరి ఎక్కడ జరిగినది తెలుసుకోవలెను.

## 10వ అధ్యాయము

### అది సృష్టి ఎక్కడ జరిగినది

ఆదిసృష్టి హిమాలయాలు మీద జరిగినదని వైదిక సంపత్తిలో చూపిన విషయమును ఇక్కడ చూపుచున్నాము.

హిమాలయాలు అతి పెద్దదైన, ఎత్తైన పర్వతము, అన్నిటికన్న ఎత్తైన లేక పెద్దది పాతది. ( చిన్న ఎవరెస్టుగా యున్నది) ఇక్కడ సముద్రము నుండి 29000 అడుగులు పెద్దది. పృథ్వి మండలములలో దీని కన్న ఎత్తైన స్థానము ఏదీ లేదు. దీనియొక్క ఎత్తు దీనికన్న అతి ప్రాచీనదిగా కనబడుచున్నది. ఆరంభములో సమస్థ 'పృథ్వి' జలముతో నిండియున్నట్లు చెప్పుతారు. ఆ జలముతో మొట్టమొదట సర్వ ప్రథమమం అక్కడనే 'భూమి' ఏర్పడినది. దానిలో వనస్పతి ఉత్పన్నమైనది. మరియు దానిలో నుండి 'మనుష్యుని ప్రాణులు ఉత్పన్నమైనవి. ఏదైతే అన్నిటికన్న అధికంగా ఎత్తైనది, భూమి యొక్క ఎత్తు పెరగడము కారణము (బిగ్‌బ్యాంగ్) విప్లవముగా యున్నది. భూమి యొక్క లోపల 'తప్త-తరల్' పదార్థములు నిండియున్నవి. అప్పుడు అవి బైట పడుతవి. మరియు (డేర్) నేరుగా ఏకత్రితము అవుతవి. అప్పుడే పర్వతముల యొక్క సృష్టి ఏర్పడినవి. ఏ కొండ పర్వతము ఎంత ఎత్తైనదిగా నుండినో దానిని (ఫెక్‌నేవాలి) పడద్రోయుట, అగ్ని ప్రాప్తవు, శక్తి ఎంత అధికమైనదో అంతః

బలవంతమైనది, హిమాలయ అన్నింటిలో విశాలము మరియు ఎత్తైనది లేక ప్రధానమైనది. ఎందుకంటే దానిని చేయువాడు చేయునది శక్తి కూడ సమస్త ప్రసాత్ శక్తిలకన్న ప్రబలమైనది. ఇంత పెద్ద మహాశక్తి సంచిత్ రూపములో అప్పుడే కలియగలదు. అప్పుడు అది ఏమిటికి, మొత్తము మీద చాలా చిన్న అక్షుణ్ రహాహో మరియు ఇది నిర్వివాదమైనది. కనుకనే 'అట్టిశక్తి' సృష్టికన్న ముందు యుండి యుండవచ్చును. ఇక్కడ దీనిని అనుమానముంచుట సరళమవుతుంది. అనగా సులభమౌతుంది. ఎందుకంటే పృథ్వి సర్వతోముఖముగా హిమాలయ పర్వత ప్రాంగణమందు సర్వ ప్రథముగా వెలసినదిగా నుండును.

హిమాలయ ఎత్తు భాగము మరియు మనుష్యుని సృష్టి సిద్ధాంతముపై అమెరికా యొక్క ప్రసిద్ధ విద్వాంసుడు (డెవిస్' తన హర్మోనియా అను పుస్తకమందు ఐదవ భాగము (పుట 328) లో 'ఒకన్' యొక్క సాక్షితో వ్రాస్తాడు. హిమాలయ అన్నిటికన్న ఎత్తైన స్థానము, ఎందుకంటే అదీ సృష్టి హిమాలయ పర్వత ప్రాంతమున జరిగి యుండును. (వైదిక్ సంపత్తి పుట : 193)

పైన చూపిన ప్రకారముగాక, భారతీయ వైదిక ఆర్యుల శాస్త్రములలో వారి మూలస్థానము ఏమి వ్రాసినారో చూడవలెను.

## 11వ అధ్యాయము

**శ్లోకము :**

హిమాలయా భి ధనో అయం - భ్యాతోభింలోకేషు పావనః
అర్థ యోజన విస్తార పంచ యోజన మాయతః
పరిమండల్యోర్మధ్యే - మేరు ఋతుమ పర్వతః
తతః సర్వాః సముత్పన్నా - వృత్ యోద్విజసతమ్ ॥
ఐరావతీ వితస్తాచ - విశాలాదేవి కాకుహు,
ప్రసూతీర్యత్రవిప్రాణాం - శృయతే భరతర్షభ ॥ (మహాభారతం)

అనగా సంసారమే ప్రపంచములో పవిత్రమైనదిగా హిమాలయ ప్రసిద్ధము. ఇందులో ఒక యోజన చూపినది లేదు. మరియు ఐదు యోజన దూరములో 'మేరు' పర్వతము యుండును. అక్కడ 'మనుష్యుల' ఉత్పత్తి లేక పుట్టుట అయినది. ఇక్కడ నుండి ఐరావతి, వితస్తా, విశాల, దేవిక, మరియు కుహు అను అన్ని నదులు. ఇక్కడి నుండి ప్రవహించును. ఇక్కడనే బ్రాహ్మణులు పుట్టిరి. ఈ ప్రమాణములచే హిమాలయ యొక్క 'మేరు' ప్రదేశము మీదనే ఆది సృష్టి వెలువడిన వర్ణన యున్నది. దీనికి అధిక పుష్టియిచ్చె ప్రమాణము మాకు దొరికినదిగదా, హిమాలయము మీద 'అమైతు' ని సృష్టి యొక్క పుట్టుక జరిగినట్లు నిశ్చయము అవుతుంది. ఏ మేరు స్థానము గురించి పై వర్ణన చూపిన దాని వద్దనే (దేవికా - పశ్చిమే - పాశర్వేమానుసం సద్విసేవితమ్) అనగా దేవికా వర్ధనికాస్, వర్ధ పశ్చిమ దిశయొద్ద 'మానస్' యున్నది. ఈ మానస్, ఇప్పుడు ఒక కొండయున్నది. దీనికి 'మానస్' పేరు (మానస్) అమైతుని సృష్టి యొక్క కారణము ఏర్పడినది. (వాయుపురాణములో, 50-88 వ్రాసి యున్నది. వైదిక్ సంపత్తి - పుట సంఖ్య : 201) సృష్టి ఉద్భవమై 6 మను వంతర్లు 27 ( ఇరువది యేడు) చతర్ యుగములు మరియు 5030 వర్షములు - అనగా సంవత్సరములు గడచినవి.

## 12వ అధ్యాయము

### ఆది సృష్టి - పృథ్వి

యిప్పుడు ప్రశ్న యిది కదా? 'పృథ్వి' ఎప్పుడు వెలసినది, మరియు మనుష్యుడు ఎప్పుడు సృష్టించబడినాడు, సృష్టి యొక్క వరుస సంఖ్య అనగా సృష్టి ఉత్పత్తి మరియు మనుష్యుడు ఎప్పుడు సృష్టించబడినాడు, సృష్టి ఉత్పత్తి అయిన దగ్గర నుండి సమీపమున రెండు ఆరబుల వరకు చేరి యుండవచ్చును. కాని మనుష్య జన్మము కాలేదు. ఏ సమయము సృష్టి యొక్క ఉత్పత్తి ఆరంభము నుండి తీసుకొని ఇప్పటి

వరకు కూడా ఉన్నది. సృష్టి ఉత్పత్తిని ఎప్పటినుండి ఒప్పుకుంటారో, అప్పటి నుండియే సృష్టి పుట్టుట, ఆరంభము అయినది. అనగా ముక్తి ప్రకృతి యొక్క పరస్పర సంఘాతము ఆరంభము అయినట్లు మరియు పరమాణు నుండి ద్వణుక్ అనునవి పుట్టు ఆరంభము అయితది. ఈ సమయము నుండి తీసుకొని సూర్య, నక్షత్రాలు అనునవి పుట్టేవరకు సమయమును స్వయంభువమను అంటారు. స్వయంభూవమను సమయమునకు ఉత్పన్న (ఉత్తాన్‌పాద్) మరియు ధృవ అనునది నక్షత్రములు. ఆకాశము నందు ఉండెను. ఏ ప్రకారముగా స్వయంభూవమను, సమయమునకు నక్షత్రాది (జగత్) ప్రపంచమంతయు తయారై సిద్ధముగా నుండెను. జగము వెలసియుండెను. ఇదే ప్రకారముగా రెండవ స్వయంభువమను యొక్క సమయమున పృథ్వి వెలసి యుండెను. (3) మూడవ స్వయాభువమను వచ్చేటప్పటికి పృథ్వి నుండి చంద్రుడు దూరమాయెను. (4) నాలుగవ స్వయంభువ మను సమయమునకు సముద్రము నుండి భూమి వెలసినది. (5) అయిదవ స్వయంభువమను వచ్చినప్పటికీ, వనస్పతి లేక ఓషధములు వెలసినది. అనగా భూమిపై చెట్లు చేమలు ఉద్భవించినవి. (6) ఆరవ స్వయంభువమను సమయమునకు పశువులు జంతు జాలములు పుట్టినవి. (7) ఏడవ స్వయంభుమను సమయమునకు వైవస్వత్‌మను యొక్క సమయమున మనుష్యుని యొక్క జన్మ అవతరించినది. దీని యొక్క లెక్క పుట **25లో** యుగముల యందు చూడుడు.

**13వ అధ్యాయము**

సృష్టిలో మనుష్యుని జన్మ ఉద్భవమైన తరువాత, ఏడవ స్వయంభువమను నుండి నేటి వరకు మనుష్యులు పృథ్విలో భూమిపై యున్నారని, ఆకాశముపై లోనున్న గ్రహములలో ఏ ఒక్క జీవి లేదని సైంటిస్టులు, ఆధ్యాత్మికుల వాదన, మనకు కనబడుచున్నది కూడానూ, సైంటిస్టులు సృష్టియొక్క పుట్టుక భూమిపై పరిశీలించడము, జరుగుచునే యున్నది. మరి ఉపగ్రహముల సహాయముతో చంద్ర

మండలమునకు మరియు శుక్రమండలమునకు పోయి వచ్చినట్లు మనకు ఆధారము కనబడుచున్నది. మనుష్యుడు ఉపగ్రహములతో పోక పూర్వము అనగా 1954వ సంవత్సరమున ఆర్యసమాజము ఆర్యనగర్ లాలాగూడ యందు, ఒకనాడు సత్సంగములో నేను సప్తగ్రహముల గురించి మాట్లాడుతూ, మనుష్యుడు అన్ని గ్రహముల యందు పోగలడు, కాని ఒక సూర్య గ్రహమందు పోజాలడనియు లేక పోయినట్లయితే వాడికి అనగా ఆ జీవికి మోక్షము కలుగును, అనగా మరల రెండవ జన్మ ఉండదని చెప్పినాను. నాకు బాగా జ్ఞాపకము అది యిప్పుడు మనిషి యంత్రము ద్వారా వెళ్లి రాగల్గినారు. మరియు అక్కడ ఏవి జీవులుకాని, జంతువులు, మనుష్యులు కనబడలేదని చెప్పడము జరిగినది. వారి వాదనని జతపర్చినారు. కాని ముస్లిముల పవిత్ర గ్రంథము 'ఖురాన్'లో ఒక వాదన యున్నది. అది ఏమిటంటే మనిషి చనిపోయిన తరువాత, వారి కర్మానుసారముగా ఆ జీవి చంద్రమండలమునకు పోయి నివసించును మరియు ఆ జీవికి రెండవ జన్మ లేదని వారి నమ్మకము. క్రిష్టియన్లు మరియు హిందుమతములో గురు ఉపదేశములు తీసుకున్న వార్ల అభిప్రాయము కూడ జన్మలేదనియే యున్నది. అందువల్ల అన్ని మతాల వారు మనిషిచనిపోయిన తరువాత ప్రాణం లేని దేహాన్ని పూడ్చి పెట్టుతారు. మరొక వర్గము వారి వాదన ఏమంటే చనిపోయిన జీవికి రెండవ జన్మము ధరించునని వారి నమ్మకము, ఇందుకు కొన్ని ఆధారాలును మరియు చేతి రేఖల యొక్క చూచి చెప్పుట మరియు మరికొన్ని ఇన్సిడెంట్స్ ద్వారా చెప్పడమనేది కూడ యున్నది. మరి హిందు మత పవిత్ర గ్రంథమైన భగవత్‌గీత యందు కూడ చూపబడియున్నదియే నిదర్శనము. భూమిపై వున్న మనుష్యునికి వర్ణాశ్రమ ధర్మ ప్రకారము వంద యేండ్లు నిర్ణయించబడినది. కాని ఆకాశ నక్షత్ర గ్రహము నుండి 500 (ఐదు వందల) సంవత్సరముల వయస్సు గల వింత మనిషి నక్షత్ర గ్రహము నుండి సాసర్ రూపములోనున్న పడవ అమెరికాలో దిగినారు. వారి గురించి చూపుచున్నాము.

## 14వ అధ్యాయము

### నక్షత్ర మండలము నుండి వింత మానవులు

అనంతమైన విశ్వంలో మనిషి చూపు, బుద్ధి, మేధస్సు, కొంత మేరకే పరిమితము. మనిషి ఊహలకు, ఆలోచనకు, ప్రయోగాలకు అందనంత దూరములో వున్న అపరిమిత విశ్వంలో ఎక్కడెక్కడో, ఎన్నెన్నో అద్భుత ప్రాణులు, గ్రహాంతరయానాలు చేస్తూ వుండవచ్చును.

ఈ ఆలోచనకు బలపరిచే ఓ అద్భుత సంఘటన, అమెరికాలో సంభవించినట్టు ? దాన్ని ఆ ప్రభుత్వము గోప్యంగా వుంచినట్లు వార్తలు వెలువడ్డాయి.

### గ్రహాంతర వాసి - ఆగమనం

గత ఏడాది 1992 ఆగస్టు నెల, నేవి ఎయిర్‌క్రాఫ్టు కేరియర్ డెక్ మీద ఒక పెద్ద యఫ్. ఓ. సాసర్ ఆకారంలో వుండే అంతరిక్షనౌక దిగింది. అందులో వున్న ఓ వింత ప్రాణి అక్కడి అధికారులకు మూడు - నాలుగు ఏండ్ల వయస్సున్న బాలుడిలా కనిపించే ఆ గ్రహాంతరవాసి వయస్సు 500 (అయిదు వందల) సంవత్సరములు అని అమెరికా రహస్య గూఢచారి వ్యవస్థ (సి. ఐ. ఎ.) కు చెందిన ఒక వ్యక్తి రహస్యంగా ఈ నిజాన్ని బయట పెట్టారు.

రహస్యంగా దాచారు. ఈ గ్రహాంతరవాసి అమెరికాలోని వాషింగ్‌టన్ డి.సి.లో, అన్ని సదుపాయాలు వున్న రహస్య మందిరంలో దాచబడ్డాడని, ఏదో ఒక రోజు ఇలాంటి వ్యక్తుల ద్వారా నక్షత్రాల నడుమ విహరించగల ఫ్లైట్స్ సాంకేతిక పరిజ్ఞానము, మానవాళి తెలుసుకోగలరని ప్రముఖులు భావిస్తున్నారని ఓ రహస్య గూఢచారి వివరణ. భూమికి సంబంధించిన ఓ ఇతర గ్రహవాసి గురించి పరిశోధనలు చేయడానికి అవకాశం దొరకడం ఆ దృష్టిమే? అని తన ప్రాణాల్ని భవిష్యత్తుని లెక్కచేయక ఆ వింత జీవి వివరాల్ని ఫోటోల్ని అందించాడా రహస్యవ్యక్తి.

**అపూర్వ మేధస్సు :**

ఈ ఉపగ్రహవాసి గొప్ప మేధావిలా కనిపిస్తున్నాడు. ఇతడు చాలా సహజంగా మాతో కలిసి పోయి మా ఏజంట్లతో మాట్లాడుతున్నాడు. అంతేకాదు, ఆ వింత జీవితో అమెరికా అధ్యక్షులు ప్రెసిడెంట్ జార్జి బుష్ కూడా మాట్లాడినట్లు మాకు తెలిసింది.

ఈ అంతరిక్ష ప్రాణి విశేషణములను పబ్లిక్‌కి తెలియజేయడానికి ఎంతో సమయం పట్టదు. కష్టం కూడా కాదు, కాని అతడి నుండి సైంటిస్టులు చాలా తెలుసుకోవాలనుకుంటున్నారు. అందుకే దాన్నింకా పబ్లిక్ చెయ్యలేదు.

ఏది ఏమి అయిన అంతరిక్షములో వున్న సౌర కుటుంబమే గాక, ఇతర నక్షత్ర గ్రహ కూటములకు వెళ్లేందుకు కావలసిన టెక్నాలజీని అతడి నుంచి పొందడం సంభవం కాదని నాకనిపిస్తుంది అన్నాడు రహస్య వ్యక్తి.

వింత రూపము - 'బల్బ్' ఆకారంలో ఆకారంలో వుండె నిగనిగలాడే తల, తెల్లని కనులలో గీతల్లాంటి కనుపాప, విశాలమైన నోరు, మూడు అడుగుల పొడుగు వున్న గ్రహాంతరవాసి తన వయస్సు 500 సంవత్సరములు అని చెప్పాడు. 500 సంవత్సరాల పాటు ఆ అంతరిక్షవాసి ఎలా బ్రతకగలుగుతున్నాడో, అంత కాలము బ్రతికేందుకు, అతడు నివసిస్తున్న గ్రహంలోని వాతావరణం, ఎలాంటిదో అది భూమ్మీద మానవ కోటికి ఉపకరిస్తుందేమోనని సైంటిస్టులు అతడి నుండి మరిన్ని వివరాలు తెలుసుకోవడానికి ప్రయత్నిస్తున్నారు.

గత ఆగస్టు 12వ తేదీన 1992 పసిఫిక్ మహా సముద్రములో సైనిక విన్యాసాలకు సిద్ధంగా వున్న యు. ఎస్. ఎస్. నిమిట్జ్‌పై సాసర్ ఆకారములో వున్న అంతరిక్ష నౌక దిగడంతో ఈ అంతరిక్షానికి కథ ప్రారంభమైనది.

**సంస్కారవంతుడు :**

యు. ఎస్. ఎస్. సిమిట్జ్ ప్రాంతములో వచ్చిన ఆ కొత్త అంతరిక్ష నౌక లాండ్ అవ్వడానికి కొన్ని ఫైటర్ జెట్స్ కారణమయ్యాయి. ఈ అంతరిక్ష నౌక లాండ్ అయిన రోజున అందులో నుంచి నలుగురు వ్యక్తులు దిగారని అప్పట్లో వార్తలు వచ్చాయి. కానీ ఐ. ఐ. ఏ. కి చెందిన రహస్య వ్యక్తి స్టార్‌షిప్ పైలెట్‌గా వున్న ఈ మూడు అడుగుల వ్యక్తి మాత్రమే పట్టుపడ్డాడని చెప్పారు.

''ఈ చిత్రమైన అంతరిక్ష వాసికి ఏ అద్భుత శక్తులు లేవు. కానీ చాలా మేధావి అని, సభ్యత, సంస్కారము గం ఉన్నత సంస్కృతి గల ప్రాంతము నుండి మాత్రం వచ్చినట్లు తెలుస్తుంది.'' అంటున్నారాయన.

**ఐ. క్యూ. - 400 :**

నేను యాండ్రోమోధా గెలాక్సీలోని 'ఎల్నార్' గ్రహవాసిని అని ఆ పరగ్రహవాసి చెప్తున్నాడు. అతడి తెలివి తేటలపై జరిపిన చిన్న చిన్న పరీక్షలో అతడి ఐ. క్యూ. పవర్-400 అని, అతడికి భూమిపై వున్న అన్ని భాషల్లో కూడ అనర్గళముగా మాట్లాడే మేధస్సు వుందని తేలింది.

''ఆ పరగ్రహవాసి ఆహారపు అలవాట్లు మామూలుగానే వున్నాయి. 'బ్లాక్ బెర్రీస్' తింటాడు. మేకపాలు త్రాగుతాడు: 5 లీటర్ల పాత్రతో పాలుతాగుతాడు. అని సి. ఐ. ఏ. గూఢచారి వివరణ.

**విభిన్నవార్తలు :**

గ్రహాంత వాసి దిగివచ్చిన స్టార్‌షిప్‌ని సైంటిస్టులు స్వాధీనం చేసుకొని, దాని కోఫ్ కెనా వేరల్‌కి పరిశోధనలకై తీసుకెళ్లారనియు యు. యస్. యస్. పైలట్స్ ఆ స్టార్‌షిప్స్‌లో విహరిస్తున్నారని కూడా ముందు ముందు వార్తలు, వినవచ్చాయి. ఐతే ప్రస్తుతము ఆ స్టార్‌షిప్ ఎక్కడ ఉందో ఎవరికి తెలియదు. సి. ఐ. ఐ. ఏ. విభాగానికి

చెందిన ఓ రహస్య వ్యక్తి చెప్పిన ఈ విషయములు పబ్లిక్‌లోకి వచ్చాయి. దీనిని సి. ఐ. ఐ. ఏ. నేవీ, వైట్‌హవుజ్ వ్యక్తులెవరూ నిజమని గానీ, అబద్ధము అని గాని ఖచ్చితముగా చెప్పలేకపోతున్నారు. అయితే అంతర్గత వ్యక్తులు కొందరు, ఏదో పెద్ద వ్యవహారము ఇందుకు సంబంధించి జరుగుతుంది అంటున్నారు. ఈ నవంబర్ 1992లో జరగబోయే ఎన్నికలలోగా ఈ అంతరిక్షవాసి వ్యవహారాన్ని అధికారికంగా ప్రకటించడం జరగవచ్చు అని వారంతా అభిప్రాయపడుతున్నారు. (స్వాతి వారపత్రిక 10-7-1992)

- రా. కె. ఎల్. చంద్ర

అంతరిక్షంలో నుండి అమెరికాలో దిగిన ఒక వింత ఆకారము గల మనిషి విషయము తెలుసుకున్నాము. యిప్పుడు రెండవ వింత కథ రష్యాలో జరిగినదని తెలిసిన విషయము మీ ముందు చూపుచున్నాము. వారు కూడ అంతరిక్షం నుండి దిగి వచ్చిన పసుపు రంగు గల మనుష్యులని డక్కన్ క్రానికల్ దినపత్రికలో తేది 20-8-1989 మాస్కో నుండి వచ్చిన వార్త (యు. యన్. ఐ) (2) సెలస్టీయల్ ఇన్విటేషన్ అనియు ఉక్రేనియాలో దిగినట్లు వచ్చిన వార్త అక్టోబర్ 9, 1989 (డి.పి. ఏ.) స్పేస్ ఆరైయన్స్ ల్యాండ్ ఇన్ రష్యాలో రెండు సార్లు దిగినట్లుగా చెప్పడము జరిగినది.

పై రెండు వింత కథలను చూచిన తరువాత, భూమిపైనున్న పరిశోధనలు చేస్తూ వున్న సైంటిస్టులకు ఒక వింతగా మరి ఆశ్చర్య గోచరముగా కనబడుచున్నది. వీటిపై కూడ అమెరికా సైంటిస్టులు పరిశోధనలు కొనసాగిస్తూన్నారని తెలిసినది. ఈ విషయములో సైంటిస్టులు మరియు చదువర్యులు కూడ పరిశోధన చేయవలసియున్నది. ఈ రెండు వింత కథలు జరిగిన దేశములు, భూమిపై నున్న మనుష్యులను, అంతరిక్షంలోని చంద్రమండలమునకు మరియు శుక్రమండలమునకు పోయి వచ్చిన దేశములు అయిన అమెరికా మరియు రష్యా - ఉక్రేనియా వంటి దేశములలో ఈ వింత కథలు జరగడము కూడ విశేషమే ?

## 6. ఆరవ ప్రకరణము - మానవుని జన్మస్థానము - భారత దేశ వైశాల్యము

### 1వ అధ్యాయము

సృష్టి యొక్క మూలము మొదట ప్రకరణము. రెండవ ప్రకరణములో చూపబడినది. మానవుని సృష్టి కూడ వివిధ గ్రంథముల నుండి, మరియు సైంటిస్టులు చూపినది కూడ ఇందులోనే చూపబడినది. యిప్పుడు మనుష్యులని జన్మస్థానము గురించి తెలుసుకోగలము. మహా భారతము మనకు అతి ప్రాచీన గ్రంథము లోని శ్లోకము మరియు వాయు పురాణములో చూపిన మాన్‌సరోవర్ గురించి మరియు అది సృష్టి జన్మస్థానమును గురించి ఐదవ ప్రకరణము 12వ అధ్యాయములో చూపినాము. చూడుడు.

### 2వ అధ్యాయము

ఇక్కడ మనము చూడవలసినది యేమంటే, ''మానస్'' అనగా మనుష్యుడు, మానవుడు, అదిసృష్టి ఎక్కడ పుట్టినదో అక్కడనే మానవ సృష్టి జరిగినదిగా కనబడుచున్నది. ఈ మానస్ అనునది మాన్ సరోవర్ అను స్థానమున మనుష్యుడు జన్మపొందినట్లు కనబడుచున్నది. ఇది హిమాలయ వద్ద (త్రివిష్టపం) లేక టిబెట్టు లోని భాగము. ఇప్పుడు తిబెట్టుతో సహా చైన ఆధీనములో యున్నది. ఈ మానవులు హిమాలయ ప్రాంతములో నివసించుటచే, వీరిని ఆర్యులని, బ్రాహ్మణులు, సంచించేవారనీ, తరువాత వీరు దక్షిణ దిశ అయిన నర్మదానది వద్దకు పోయి యుండిరి. ఏ విధముగా జన సంఖ్య పెరుగుతూ, వీరు పశ్చిమ దిశ, తూర్పు దిశలో పోయిరి. అవియే ఇప్పుడు పశ్చిమ దిశ హిరణ్య రాష్ట్రముగా అనగా ఈరాన్ తూర్పుదిశగా ఆస్ట్రేలియా అనగా ఆంధక రాజ్యము ఈ రెంటి మధ్య భాగమందు మానసరోవర్ యున్నది. అప్పుడున్న భారతదేశమును ఆర్య వర్తమనియు, త్రేతాయుగము వరకు

మనకు కనబడుచున్నది తరువాత ద్వాపర యుగములో భరతుడు రాజ్యమేలిన పిదప భారతదేశము అని అన్నారు.

ఈ భారతదేశము యొక్క వైశాల్యము అప్పటికున్న దిశలు అనగా సరిహద్దులు, ఈ విధముగా యున్నవి.

పశ్చిమమున హిరణ్య రాష్ట్రము అనగా ఇరాన్

ఉత్తరమున త్రివిష్టపం (టిబ్బత్తు) అనగా టిబ్బత్

తూర్పున ఆంధక రాష్ట్రము అనగా ఆస్ట్రేలియా

దక్షిణమున శ్రీలంక అనగా నేటి లంకా అనియూ రామాయణము మరియు మహాభారతములో కనబడుచున్నది. ఈ వైశాల్యమును బట్టి అప్పటి భౌగోళిక పరిస్థితుల ననుసరించి చూస్తే మాన్‌సరోవర్‌మే మనకు సెంట్రల్ అనగా మధ్య భాగముగా కనబడుచున్నది. ద్వాపరము తర్వాత ఎవరికి వారే తమ తమ రాష్ట్రములు, వేరు వేరుగా చేసుకొని చిన్న చిన్న రాష్ట్రములుగా ఏర్పడినవి. మరియు భారత దేశము నుండి విడిపోయినవి. తూర్పున ఆస్ట్రేలియా రాజు తృణబింధు అను ఆంధ్ర రాజు యుండెనని శ్రీరఘునందన శర్మః పండితుడు తనవైదిక్ సంపత్తిలో చూపినాడు. అక్కడి నుండియే కోలా ర్యాన్లు అనగా నేటి కోలీలు, వుుందాలు, త్రేతా యుగమందే వచ్చి యుండిరనినట్లు, శ్రీహర్మవర్త్ వరల్డు చరిత్ర కారుడు వ్రాసినాడు. మరియు శ్రీశరత్ చంద్ర రాయ్‌గారు ముందాఫ్ దేర్ కంట్రీలో చూపినాడు. మరి పశ్చిమ దిశలో నున్న ఇరాన్ అనగా హిరణ్య రాష్ట్రమని మొన్న మొన్నటి వరకు యుండెను. తరువాత తురకులలో కలిసిన, ఆ రాజ్య పరిపాలకులైన తురకరాజు తన బిరుదుతో పహల్య ఆర్య యని సంబోధించుచుండెవారు. ఈ పహల్వాలు, యవ్వనులు, శిశు నాగులు, శాక్యవంశస్తులు మరియు మృదరాజులు అనగా నేటి ముత్తరాజులు, ఎందరో రాజ వంశస్తులు యుండిరని, రామాయణ విశేషమును గ్రంథమందు శ్రీ సూరవరపు


హిరణ్య రాష్ట్రం
(IRAN)
త్రివిష్టం
(TIBET)
మానస సరోవరం
శ్రీలంక
(SRILANKA)
అంధక రాజ్యం
(AUSTRALIA)
N

ప్రతాప్ రెడ్డిగారు చూపినారు. భారతదేశము యొక్క వైశాల్యము ఎంత వరకు యున్నది, అతి స్పష్టముగా కనబడుచున్నది. మరి యొకటి ఏమంటే యయాతి రాజు రెండవ కుమారుడు తుర్వసుడు పశ్చిమ దిశలో నున్న భూభాగమును పరిపాలించెనని యున్నది. ఆతుర్వసు సంతతి వారే ముత్రరాజులు అనగా ముదిరాజులని, క్యాస్ట్ అండ్ ట్రైబ్స్ ఆఫ్ సదరన్ ఇండియాలో చూపబడినది. తుర్వసుని సంతతి వారే భరతుడు, భారత దేశమును పరిపాలించిన చక్రవర్తి యని మనకు మహా భారతమున కనబడుచున్నది. మరియు తుర్వసుని సంతానమే తురకులు తుర్వసుని ముఖ్య పట్టణము నేటి తురికిస్థాన్‌గా యుండెను. కాన తురకీయులు చంద్ర వంశము వారమనియు కూడ చెప్పుకోవడము యున్నది, మరియు భారత దేశము నుండి పోయిన రాజులుగా మారి రాజ్య పరిపాలన చేసిన కాలమానము, సృష్టి ఉద్భవము (పుట 23) ఐదవ ప్రకరణము 6వ అధ్యాయమున చూడుడు. అందు నుండి ముఖ్యమైన వారు పశ్చిమ దిశకు పోయినవారు.

**3వ అధ్యాయము**

**1) చాల్డిషియన్ :** దక్షిణ భారతము నుండి పోయిన వారు చోళులు అనియు, మరికొంతమంది చరిత్ర కారులు చూపినది చాళుక్యులు అని కూడ యున్నది.

**2) అరబ్బులు :** అనగా వీరు ఆరవలు - దక్షిణము నుండి పోయిన రాజులుగా ఏర్పడినారు. వారే అరబ్బులు వీరి మాతృభాష తల్లి తమిళము అని శ్రీ తంగిరాల రామచంద్ర, తమ పూర్వపు లిపి అను పుస్తకములో చూపినారు. మరియు వైదిక్ సంపత్తిలో కూడ యున్నది.

**3) ఫినిషియన్ :** వీరు దక్షిణ భారతము నుండి పోయిన పాండ్యరాజులు.

**4) సిరియన్‌లు :** కేరళలోని సిరియనులు.

**5) బైబిలోనియన్ :** వీరు ఉత్తర ప్రాంతము నుండి పోయిన వారు.

**6)** రెడ్ ఇండియన్స్ : వీరు కూడా భారతదేశము నుండి పోయిన అతి ప్రాచీనులు, వీరు ఇప్పటికి హిందు మత సాంప్రదాయమును పాటించుచున్నట్లు, స్వర్గీయ రణవీర్, మిలాప్ సంపాదకులు అక్కడికి వెళ్లి వారితో కలిసి తెలుసుకొన్నవారు మరియు వైదిక్ సంపత్తిలో కూడ వీరి ఛాయాచిత్రము యొక్క పటములలో వీరి గురించి వ్రాసినారు.

పైన చూపిన వారే గాక యింక కొన్ని జాతుల వారు భారత దేశము నుండి పోయి మరొక పేరుతో భారత దేశమునకు వచ్చినవారు. వైదిక సంపత్తిలో చూడుడు.

**4వ అధ్యాయము**

ఇక్కడ మనకు కనబడుచున్నది ఏమనగా, మానవుడు జన్మించినది మాన్ సరోవర్ యనియు తెలిసినది. ఇదియే సెంట్రల్ ఏసియా యనియు చెప్పవచ్చును. కాని పాశ్చాత్య పండితులు, చరిత్రకారులైన మ్యాక్సుముల్లర్, ఏసియా సెంటర్ ఇరాన్ అని చూపినారు. ఇది తప్పు అని ఋజావు అయినది. ఆర్యులు ఇరాన్ నుండి వచ్చిన వారని తెలుపడము సరియైనది కాదు అప్పటికి ఇరాన్ ఆర్యవర్త దేశములోనే పశ్చి దిశ సరిహద్దున యుండినదని తెలుసుకున్నాము కదా, ఇరాన్ భారత దేశములోనే యుండెను. జర్మనులు, మీడియన్లు గురించి చూచినట్లవుతే, వారు కూడ ఆర్యవర్తము నుండి పోయినవారు, మొదటి ఆర్యులని వారి వారి చరిత్రలోనే యున్నది. మరియూదులు, వీరు యాదవులై యుండవచ్చును. వారి చరిత్ర కారుడైన జోరహాస్టీన్ వ్రాసిన దానిలో తూర్పు నుంచి వచ్చినవారని యున్నది. ఈ యూదులను, యవ్వనులు అని కూడ వ్రాయడం జరిగినది. కాన మొత్తము మీద ఆర్యులు - ఆర్యవర్తనము వారని, భారత దేశము యొక్క పేరు ఆర్యవర్త అని యున్నదని తెలియవైనది. ఆర్యులు - ఆర్యావర్త అను పుస్తకము చూడుడు.

ఇదియును గాక మరొక గట్టి బలమైన వాస్తవమైన విషయము ఆర్యులు ఇక్కడి వారే, ఎక్కడో వారో కాదు. ఈ విషయము ఆంధ్ర ప్రభ శనివారం తేది 17-12-1994 దినపత్రికలో ప్రచురించబడినది.

న్యూఢిల్లీ డిసెంబరు 16న పురావస్తు శాఖ ప్రపంచ మహాసభలోని నిర్ణయము ఈ క్రింద చూపబడుచున్నది.

**ఎక్కడివారో కాదు - ఆర్యులు ఇక్కడి వారే**

ఆర్యులు మధ్య ఏసియా నుంచి భారత దేశానికి వచ్చారని ఇన్నాళ్లుగా నమ్ముతున్న సిద్ధాంతము తప్పని ఇప్పుడు కొత్తవాదన బయలుదేరింది. క్రీస్తు పూర్వం 1500 - 1200 సంవత్సరాల మధ్య ఒక వెలుగు వెలిగిన స్వదేశీయులే ఆర్యులని కొందరు నిపుణులు వాదిస్తున్నారు. ఆ కాలములో మధ్య ఆసియాకు చెందిన ఏ సంస్కృతి కూడా సింధు ప్రాంతాన్ని లేదా ఇప్పుడు సరస్వతి నది ఎండి పోయిన ప్రాంతాన్ని దాటి రాలేదు అని డ్యాక్టరు ఎస్.పి. గుప్త నాయకత్వంలోని పండితులు అంటున్నారు. ఆర్యుల దండయాత్రపై నెలకొన్న అపోహలు తొలిగించేందుకు వారు పురావస్తు శాస్త్రన్నే ఉప కరణంగా తీసుకున్నారు. ఇటీవల ఇక్కడ ముగిసిన ప్రపంచ పురావస్తు శాస్త్రాన్నే ఉపకరణంగా తీసుకున్నారు. ఇటీవల ఇక్కడ ముగిసిన ప్రపంచ పురావస్తు మహా సభలో డా॥ గుప్తా ప్రసంగించారు. ఒక ప్రాంతము నుంచి మరో ప్రాంతానికి సంస్కృతి వ్యాప్తి చెందితే ఆ చరిత్రను పట్టి ఇచ్చేందుకు పురావస్తు శాస్త్రం కంటె మెరుగైన సాధనం మరోటి లేదని ఆయన అన్నారు.

మెహంజదారో వద్ద సింధూ - సరస్వతి ప్రాంత ప్రజలను ఆర్యులు ఊచకోతకోశారనడం వట్టి మాటేనని శ్రీ జి. ఎస్. డేల్స్ అనే శాస్త్రవేత్త కొట్టిపారేశారు. అలాగే హరప్పా వంటి బలమైన కోటలున్న నగరాలను పడగొట్టారనడం కూడ అవాస్తవము అని డా॥ గుప్త, శ్రీ కె. ఎం. శ్రీవాస్తవ, శ్రీ ఆర్. ఎస్. బిస్ట్ తదితర శాస్త్రజ్ఞులు అన్నారు. హరప్పాలో బయట పడిన నాగరిక కట్టడాల వంటివి ఒనవలి, కాలిబంగన్ వంటి ఇతర ప్రాంతాలలో కూడా ఉన్నాయని వారన్నారు. సింధు మైదానంలో ఆర్యులు స్థిరపథకమందు ఉన్న పలు సంస్కృతులకు మధ్య ఆసియాలోని సంస్కృతులకు ఎలాంటి సంబంధాలు లేవని పురావస్తు శాస్త్రజ్ఞులు గ్రహించారు.

మధ్య ఆసియా ప్రాంతము నుంచి దండెత్తి వచ్చిన వారే మన దేశానికి గుర్రాలను తీసుకు వచ్చారన్న వాదన కూడ అవాస్తవమని శాస్త్రవేత్తలు అన్నారు. గుర్రాల కపాలానికి సంబంధించిన ఆధారాలను బట్టి అవి పెంపుడు జంతువులు అని, హరప్పా వారు గుర్రాలను పెంచి వాటిని మచ్చిక చేసుకున్నారని నిర్ధారణ అయిందని శ్రీ ఎస్. ఆర్. రావు చెప్పారు. ఆర్యుల దండయాత్రకు ముందు మన దేశములో గుర్రాలున్నాయన్నది తిరుగులేని సత్యమని హరప్పా ప్రాంతములో దొరికిన ఎముకలను పరిశీలించిన మీదట పురావస్తు జంతు శాస్త్రజ్ఞుడు శ్రీ కె. ఆర్. అలూర్ అన్నారు.

## 7. ప్రకరణము

## జీవజాతుల సుదీర్ఘ పరిణామము

### 1వ అధ్యాయము

**జీవజాతుల సుదీర్ఘ పరిణామం : 450** కోట్ల సంవత్సరాల భూమి వయస్సులో దాదాపు సగభాగం ప్రాణి అనేది లేకుండానే గడిచిపోయింది. రెండు వందల కోట్ల యేండ్ల క్రితం భూమి వాయు గోళంగా సూర్యుడి నుండి బయటపడింది. ఆ వాయువులు క్రమంగా చల్లపడి శిలాద్రవము అయ్యాయి. ఆ ద్రవం ఘనీభవించి, శిలలూ ఆ తరువాత, సముద్రాలు ఏర్పడ్డాయి. దాదాపు భూభాగమంతా ఆక్రమించిన ఈ సముద్ర జలాల్లో భిన్న భిన్నమైన రసాయినిక సంయోగాలు, జరుగుతూ వచ్చాయి. క్రమేణా ప్రత్యేకమైన రసాయినిక పదార్థాలు తయారయ్యాయి. ఇవే ప్రోటీన్లు. జీవ పదార్థంతో చేరి వున్న అత్యంత ప్రధానమైన రసాయనికాలు. ఈ ప్రోటీన్లు నొకదానితో నొకటి చేరి, ఇతర రసాయినికాలతో సంయోగం పొంది, జీవ పదార్థము ఉత్పత్తి అవడానికి దోహదం అయ్యాయి. చివరికి ఈ సముద్రాల్లో ప్రోటీన్ పదార్థానికి చెందిన తుట్టెలు ఏర్పడ్డాయి. అనేక రసాయినికాల సంయోగంతో ఈ ప్రోటీన్ ఏర్పడింది. ఇదే ప్రోటోప్లాజమ్ లేదా జీవ పదార్థం. చిన్న చిన్నవైన ఈ తెలి రంగుతునకలే యావత్ ప్రాణికోటికీ అంకురం.

- డార్విన్ పరిణామం - పుట నెం.**53**

**2వ అధ్యాయము**

కణజీవులు - ప్రతి చిన్న తునక ఒక కణం, ప్రతి కణం ఒక ప్రాణి నేడు జీవించే చెట్టు చేమలకు జంతు జాలానికి ఇవే పూరీకులు. వీటి పూర్వీకులు వొకరేననీ, అన్నీ ఒకే వంశవృక్షానికి చెందినవేనని, సైన్సు నిరూపించింది. ప్రతికణజీవానికి తన్నుతాను రెండుగా విభజించుకొనే శక్తి వుండేది. ఆ విధముగా ఉత్పత్తియైన పిల్ల జీవకణాలు కొంత కాలం జీవించి, తిరిగి తమను తాము రెండుగా విభజించికొనేవి. కొంత కాలం తరువాత కలిసి పుట్టిన కణ జీవాలు కలిసే జీవించసాగాయి. ఆ విధంగా జీవ పరణామంలో బహుకణజీవులు ఉద్భవించాయి.

కాలక్రమేణ, కణాలలో మార్పు వొచ్చింది. వివిధ రకాల కణాలు జీవించే కార్యక్రమాన్ని వివిధంగా విభజించుకొన్నాయి. జంతువుల్లో, నొక చివరి నోరుగల నాళమొకటి వృద్ధి చెందింది. కలిసి జీవించే అన్ని కణాలకు, అవసరమైన ఆహారము, ఈ నాళంలో వచనంగావడం జరిగింది. శరీరంలో వొక భాగం నించి మరో భాగానికి సందేశాలు అందచేసేందుకే నరాలు అభివృద్ధి చెందాయి. జంతువుల సైజు పెద్దదైన కొద్దీ ఆహారము వచనమేయ్యే, నాలానికి దూరంగా వుండే వివిధ భాగాలకు, ఆహారము తీసుకుపోయేందుకు రక్తనాళాల సముదాయం ఏర్పడింది. ( డార్విన్ - పుట 53-54)

**3వ అధ్యాయము**

మానవుడు అజేయుడు - కోట్ల సంవత్సరాల పరిణామ ఫలితంగా, ఏక కణజీవి క్రమంగా మారుతూ, వానర దశకు జేరి, ఆ దశ నుండి నేటికి మానవ దశకు జేరుకొన్నది. అంచేత బైబిల్‌లోని యోహహ, ఖురాన్‌లోని అల్లా, ఆది మధ్యాంతర హితుడైన ఏ పరమాత్మ ప్రమేయం అని ప్రతిపాదించడమే.

( డార్విన్ సిద్ధాంతము - పుట 77)

## 4వ అధ్యాయము

ఇక్కడ మనము డార్విన్ పరిణామ సిద్ధాంతము ఎంత వరకు సరియైనది చూడవలసియున్నది. మానవుడు అజేయుడు అనియు, మరియు ఏక కణ జీవి క్రమంగా మారుతూ వానర దశకు జేరి వానర దశ నుండి మానవ దశకు చేరుకొన్నది అని చూపడము, పరిణామ సిద్ధాంతము తప్పుగా కనబడుచున్నది. మరియొక వర్ధ మానవునికి తోక యుండెదని కూడ చూపించినారు. వానర అనగా ఈ కోతికి నాటి నుండి నేటి వరకు తోకతోనే జన్మమూ కలుగుచున్నది. మరి పరుగెత్తునప్పుడు నాల్గు కాళ్ళ మీద వెళ్లుతున్నది. అదే విధముగా చింపాంజీలు కూడా, మానవ ఆకారముతో నున్నవి. కాని అవి కూడ నడిచేటప్పుడు, మానవుడు నడిచినట్లు ఎందుకు నడువకూడదు.

అదే నాలుగు కాళ్లమీద పరుగు తీస్తుంది. ఈ రెండు అతి దగ్గరగా నున్న వేగదా, ఎందుకు వాటికి మార్పు రాకూడదు. కనుక ప్రకృతిలో ఏ జీవిమొదటి నుండి జన్మించినవో, అవి ఈనాటికి అదే రూపముతో జన్మించుచున్నవి. మానవ జన్మము ప్రత్యేక జన్మమని తెలుసుకొనవలెను. మానవుని అవయవములు, అంగములు నాటి నుండి నేటి వరకు ఒకే పద్ధతిన యున్నవి. మరియు మాటలాడేది ఒక మానవునికే యున్నది. ఆలోచించే బుద్ధి ఈ జీవికే యున్నది. మానవ రూపములు అనగా ముఖము, ముఖ్య స్వరూపము జంతువు ఆకారముతో జన్మించును, కనుక ఆ జంతు ఆకారము అతనిలో మెలుగుచున్నప్పుడు స్త్రీ - పురుష సంపర్క సమయమున, వున్నట్లు అవుతే ఆ ఆకారం అతనిలో మెలుగుచున్నప్పుడు, స్త్రీ - పురుష సంపర్క సమయమున, వున్నట్లు, అవుతే, ఆ ఆకారముతో జన్మించును.

**5వ అధ్యాయము**

సైన్సు - ప్రకృతిలో చెట్లు, చేమలు, కీటకములు, మృగములు, పశువులు, వానర, జంతువులు. నాటి నుండి నేటి వరకు ఒకే రూపముతో జన్మించుచున్నవి. ఈనాడు మానవుడు సంకర జంతువులను జన్మింపచేయుచున్నారు. మనిషికి ట్యూబ్ బేబీలను జన్మింప చేయుచున్నాడు. ఇక్కడ పురుషుని సంపర్కము లేకుండానే ట్యూబ్ బేబీలను పుట్టించుచున్నారు గదా? మరి పురుష ఇంద్రియమును గర్భసంచిలోనికి పంపి గర్భము అవతరించి, పాపను కనడము జరుగుచున్నది గదా? ఈ ఇంద్రియము లేకుండగా ఎందుకు జన్మింప చేయలేరు? రసాయనముల చేత జేయవచ్చు కదా ? అది ప్రకృతికి విరుద్ధము. ప్రకృతికి విరుద్ధముగా మానవుడు పోవుచున్నాడు. ప్రకృతిని నమ్మి పోవుటకు ప్రకృతి ప్రళయములో కలిసిపోవును. కాని 'ప్రకృతి - జీవుడు' అమరులు, వీరు నాశరహితులు, వీటికి చావు - పుట్టుకలు లేవు. ప్రళయంలో మునిగిన, మరల ప్రకృతి - జీవులు ఏర్పడును. ఈ ఏర్పాటుకు, ఒకడున్నాడనీ తెలుసుకోవలెను. ఎవడైతే ఈ ప్రకృతిని, జీవులను, జన్మింప చేసిన వాడు, కనబడడు. అందువల్ల పూర్వపు ఋషులు తమ వేదములలో, ఉపనిషత్తులలోను, ఈ మూడింటి గురించి వివరముగా తెలిపినారు. వీరినే త్రిమూర్తులని కూడా చెప్పడము జరిగినది. నేటికి మనము అవలంబించుచూ ఉన్నాము. ఆచరణలో పెట్టుచున్నాము. పూజించుచున్నాము. ఈ విషయములో ఎక్కువగా తలదూర్చటం అంత సమంజసము కాదేమో, విజ్ఞానవంతులు, శాస్త్రజ్ఞులు, జ్ఞానమున పరిశోధనలు చేసినట్లవుతే, రాబోయే ప్రళయమును రక్షించిన వారవుతారు. భూమిలోని ఖనిజములను; ఖనిజ వాయువులను, రస గంధములను వెలుతీసుకోకుండా, శాస్త్రజ్ఞానమును ఉపయోగమును చేసుకున్నట్లయితే, ఇంక కొంత కాలము నాటికి మనమంత కలిసి అభివృద్ధి జెందగలము అని నా ఉద్దేశ్యము. మరి వచ్చే జనరేషన్‌కు తావు ఇచ్చిన వాండ్లము అవుతాము అని తెలుసుకోగలరు.

పూర్వపు వారు వేసి బాటకు మద్దతు యిచ్చు వారమౌవుతాము. ఇక్కడ ఒక కృతి గీతములో, చివరి రెండు లైనులు ఈ విధముగా యున్నది.

మానవులను సృజయించినావు - మాయజాల మేర్పడజేసినావు.

మర్మముతోనిను- కనుగొనలేక - మృతి జెందిరి నేడు (ఘనుడవోయి నీవు)

-స్వంతం.

## 8. ఎనిమిదవ ప్రకరణము

### 1వ అధ్యాయము

పురాణేతి హాసాల్లో పరిణామ వాదం - డార్విన్ పరిణామ వాదంలో - సి.వి.గారు చూపినది.

ఇంతవరకు వివిధ మతాల్లో విశ్వ సృష్టిని గూర్చి చెప్పబడిన దాన్ని చూశాం, మరియు మానవుని జన్మ సృష్టిని గురించి తెలుసుకున్నాము, ఇప్పుడు పురాణేతి హాసాల్లోని వాదాన్ని పరిశీలిద్దాం. మనకు పవిత్రమైన గ్రంథములు, రామాయణము, మహాభారతములు గాక, ద్వాదశ ఉపనిషత్తులున్నాయి, ప్రస్తుతము, వజ్ర సూచికోపనిషత్తులో మన వాదాన్ని ప్రారంభిద్దాం.

**శ్లోకం :**

ఋష్య శృంగోమృగోజాతః : - కౌశికోగాదినందనః

జంబుకో జంబుకోత్పత్తి : - గౌతమోగౌత సంభవః

వాల్మీకో వాల్మీకోత్పత్తి : - అగస్త్య కుంభ సంభవః

వ్యాసోలుబ్ధక సంభూతో : - వసిష్టో ఊర్వశీ సుతః

నారదో రజక పుత్రః : - కౌండన్యోముండకీసుతః

## 8 ప్రకరణము 1.వ అధ్యాయము

## వివాహిత్ - ఆనంద్ - స్త్రీ పురుష సంయోగము

ఏ అంగము సంతానము ఉత్పత్తి చేసే పనికి వచ్చేదిగా యుండునో దానిని ఉత్పత్తి అంగము మరియు జననేంద్రియము అందురు. స్త్రీ యొక్క జననేంద్రియము - పురుషుని నుండి సర్వథా భిన్నముగా యుండును. ఈ పుస్తకమందు దానిని గురించి కొంచెం, కొంచెము వర్ణన తప్ప కలిగియుండును.

### స్త్రీ యొక్క ఉత్పాదక అంగము

దీనికి వివరణ చూపడము అంత సమంజసము కాదని, కేవలము ఉత్పత్తి పిండము గురించి పై చిత్రములో చూపిన దానిని ఇక్కడ మీ ముందు చూపుచున్నాము.

1) అండ (గ్రుడ్డు) వోవమ్ దేవి నుంచి పురుషుని యొక్క వీర్యము సంయోగము అవుతుందో దానినే గర్భ స్థితి - గర్భము ధరించుచున్నది.
2) వోవరిః ఎక్కడ గ్రుడ్డు నిర్మాణము అవుతుంది.
3) ఎక్కడ (అండ) గ్రుడ్డు ఏర్పడుతుందో గర్భాశయం లోనికి వెళ్ళుతుంది.
4) నాలి (ప్రేగు) ఫైలోపియన్ ట్యూబ్ ఇందులో ఏర్పడిన గ్రుడ్డు, గర్భశయలోనికి పోతుంది.
5) గర్భశయం (యుటెరస్)
6) గర్భశయ - గ్రివా.
7) యోని - అనగా భగము.
8) యోని ద్వారము (వెజినా) ఇందు నుంచి (నేల) మాసము రక్తము పోతుంది. (నెల దూరమని అంటారు. లేక సంతాన ఉత్పత్తి కలుగుము.
9) గర్భాశయము పైభాగములో స్త్రీ గర్భములో గ్రుడ్డు తయ్యారు అవుతుందో దానిని (వోవమ్) లేక అండ - గ్రుడ్డు అని అంటారు.

స్త్రీ లోపల ఒక అండ (గుడ్డు) 28 రోజులు వుంటుందట, మరియు తయ్యారు అవుట లేక పుట్టుట, వెనకనే ఒక ప్రేగు నుండి గర్భాశయం వరకు పోతుంది. అక్కడ కొన్ని రోజులు వుంటుంది. నెల తప్పేవరకు లేక తర్వాత ఈ గ్రుడ్డ ప్రాయము గర్భశాయలో కనబడుతుంది. స్త్రీలో గ్రుడ్లు ఈ విధంగానే చిన్న చిన్న రూపములతో (ఆకృతి) మాదిరిగా వుంటుంది. కాని 50 గ్రుడ్లు కలుపుకొని వుంచినట్లవుతే కనీసము ఒక అంగుళము పొడవు స్థానమును (గెరావ) చేసుకుంటవి.

సాధారణముగా ప్రతి మాస ధర్మ దినములలో ఒక గ్రుడ్డు గర్భశయములో చేరుతుంది. అయితే అక్కడ కొన్ని దినములలో పురుషులు వీర్యము కలిసినట్లవుతే గర్భము నిలబడుతుంది. లేదా కొన్ని సమయాను ప్రకారము గ్రుడ్లు విరిగిపోవుటకు, అవకాశమున్నది. వీర్యము యొక్క విస్తుత్ వర్ణన మేవు పోయి ''పురుషుని జననేంద్రియము'' యొక్క (ప్రకరణ) అధ్యాయములో చూపబడును.

(వివాహిత ఆనంద్ పుట 138 - 139 కవిరాజ్ హరనామ్‌రాజ్)

**. వ అధ్యాయము**

**బాలురా - లేక బాలిక - ఇచ్చాను సారముగా ప్రాప్తి - విభిన్న విచారములు**

బాలుడా లేక బాలిక అనునది తెలుసుకొనుటకు ఎందరో మహనీయులు, డాక్టర్లు అనుభవము గలవారు పలు పలు విధములుగా చెప్పినారు. చెప్పిన వారి పేర్లు మాత్రము చూపుచున్నాము.

1) ప్రొఫెసర్ ష్లేస (2) డా॥ విల్సన్ (3) డా॥ హాఫకర్ (4) డా॥ ఫ్రెంక్లిన్, కాకుండా (5) నా అనుభవము మరియు అధర్వ వేదమున ఆదేశమును ముఖ్యముగా చూపుచున్నాము. .

గర్భ సిల్థిని మూడు మాసములకు తరువాత పిల్లవాని అంగములు వేరువేరుగా ఏర్పడును. లేక శరీరము నందు పుట్టును. ఆ సమయమున మరి స్త్రీలో సూర్య

గుణము అధికముగా కనబడినట్లు అవుతే మగపిల్లవారు, మరియు లేక చంద్రగుణము అధికము వున్నట్లు అయితే ఆడపిల్ల అని తెలియును. ఇదియే అన్నింటికన్నా అధిక అనుభవభూత సిద్ధాంతము.

3వ అధ్యాయము

మన ఇండ్లలో గర్భవతి కనుబడుటకు కొన్ని ఆచారములు వున్నవి. (1) స్త్రీ నెల మాసము జరుగునట్లవుతే, ఆ స్త్రీకి రెండర మాసమున వాంతులు, ఏర్పడుతవి అప్పుడు ఆడబిడ్డయని తెలుసుకుంటారు. లేక మూడవ మాసమున కూడ వాంతులతో బాధగా వుంటే అప్పుడు మగబిడ్డయని తెలుసుకుంటారు. కారణము, పై చూపిన స్త్రీ వీర్యముతో పురుష వీర్యము కలిసినప్పుడు, ఆ గర్భ సంచిలో ఏర్పడిన గ్రుడ్డు లేక అండగా ఏర్పడినప్పుడు నెల మాస రక్తము పోవుట ఆగిపోవును. ఆ విధముగా మూడు మాసములు నిలబడినట్లవుతే గర్భములో గుడ్డు లేక అండము ఒక రూపము ధరించును. అయిదవ మాసము వచ్చేవరకు పిండమున అన్ని అవయవములుతో ఏర్పడునో, తొమ్మిదవ మాసము ఏర్పడినప్పుడు గర్భములో పిండము తిరగాడుచుండును. గర్భవతి నాభి యందు రెండు వ్రేళ్లు పెట్టి చూచినట్లువుతే పిండము తిరుగుచున్నట్లు కనబడును. ఆ పిండము స్త్రీకి కుడి చేయి ప్రక్కన నుండి తిరిగినట్లు కనబడుతే మగ పిల్లవాడనియు, ఎడమ ప్రక్కనుండి తిరిగినట్లువుతే ఆడ పిల్లయనియు, నిర్ధారణ చేయుదురు. తర్వాత తొమ్మిదవ మాసమున చివరిలో స్త్రీకి తెలుపులో శ్లేషము, రక్తము, యోని యందు కనబడినట్లువుతే ఆడపిల్ల జన్మించును. లేక పదవ మాసము వరకు నిలిచినట్లయితే మగశిశువు జన్మించును. శిశువు జన్మించునప్పుడు శరీరంను తగులుకొని సన్నటి పొర తెల్లగా యుండును (అండ) గ్రుడ్డు యొక్క విధమైన తగిలి, తగలకుండినట్లు వుండును. దానిని (అండ) లేక గ్రుడ్డు : ఆ గ్రుడ్డులో పిండము

అనగా శరీరముతో నేర్పడును.దీని అండ - పిండము నుండియే చెప్పుదురు. మరి బ్రహ్మాండము అనగా ప్రకృతి, ఈ ప్రకృతిలో ఈ అండ - పిండము నుండియే సంతసించును. తర్వాత పిండ ఆకారములు, ముఖము, మనిషి ముఖమైన రూపము, జంతు రూపములుగా నుండును.

## 4వ అధ్యాయము

పై ప్రకరణములో మనుష్యుని జననము గురించి విచారించినాము, సృష్టి ఏర్పడుటకు 5వ ప్రకరణములో విచారించినాము. కాని సృష్టి ఏర్పడిన తర్వాత, ప్రకృతిలో ముఖ్యముగా ఏర్పడినది. జలము, భూమి, అగ్ని, అకాశము, వాయు, వీటిని పంచ భూతములు అని చెప్పుట కద్దు. ఈ పంచ భూతములకు ఒక దానితో నొకటి సంబంధము యున్నది. ఏ ఒక్కటి లేకుంటే జీవులు నిలువ జాలవు. ప్రకృతిలో జలము - భూమి ఏర్పడిన తర్వాత జీవుడు ఏర్పడినట్లు కనబడుచున్నది. దానిని అవతారములుగా వర్ణించి నిర్ణయించిరి. సైన్సు ప్రకారముగా జలము నుండి చిన్న ఎర్రలు వంటి పాము శరీరముగా ఏర్పడినదని చెప్పుదురు. ఆ ప్రాణి భూమి అంచుకు జలము నుండు చోట కనబడును. తర్వాత మొదటి చేప అవతారము రెండవది కూర్మ అవతారము అనగా తాంబేలు, మూడవది వరాహ అనగా పంది, నాలుగవ అవతారం సింహం, ఈ నాలుగు విష్ణువు అవతారములు ఎత్తినట్లు, దశవతారములో కనబడుచున్నది. (1) తర్వాత ఐదవది మనుష్యుని అవతారముగా చూపడము యున్నది. విష్ణువు దశావతారములు ఎత్తినట్లు మన పురాణేతి హాసములలో కనబడుచున్నది. విష్ణువు అనగా ప్రకృతి అని ముందే తెలిపినాము. జీవుడు బ్రహ్మ అనగా ప్రకృతి నుండి పుట్టినవాడు. ఆత్మ అనగా బ్రహ్మ. ఈ బ్రహ్మయే జీవుడని చెప్పడము యున్నది. ఇక్కడ బ్రహ్మ వేరు. జీవుడు వేరు. జీవునతో కలిసి యుండుట

చేత రెండు ఒకటిని ఆధ్యాత్మకులు చెప్పుచున్నారు. పై ముగ్గురిని త్రిమూర్తులుగా వర్ణన చేసిరి. విష్ణు, ఈశ్వర, అనగా అనంతము, ఆత్మ, శివ, దేనికి రూపము లేదు, సర్వంతర్యామి, సర్వశ్రేష్ఠుడు, అన్నింటిని నడుపువాడు, పరమాత్ముడు. అందువల్ల ఈ ముగ్గురిని, పూజించుట, స్మరించుట, మనకు త్రిమూర్తులుగా నిర్ణయించిరి. కాని నిజముగా పరమాత్ముని సంకల్పించుట పరమాత్ముని తెలుసుకొనుట యందు ఈ జీవికి లేక ఈ మానవునికి, ముక్తి, మోక్షము లభించును. (2) కనుక దీనిని ఇక్కడనే ముగించవలయును. వివరముతో వ్రాసినట్లు అవుతే ప్రతులు ఎక్కువగును.

**Note**

(1) From the Hindus who appear to have been acquainted with the Geological truth of the Age of Fishes having been followed in the order of creation successively by the Age of Reptils. The age of Mammals, and the Age of man, for the statement in the Hindus puranas of the Matsya Avatara of Vishnu in the First Age.

The Kurma Avatara in the second age, the Varaha Avatara in the third Age and the Nrisimha Avatara the Fourth Age (page-12)

**Note :**

1. Mundas the their country by - Sri Sharath Chandra Roy
2. Own - Author.

అందువల్ల జంతు, జంతువుల పేర్లతో పిలువబడుదురు. సింహ రూపము, అశ్వరూపము, వృషభ రూపము, మ్యాక, సర్ప, కోతి గుండ్రముగా కనబడును.

ఈ విధముగా నుండుటకు కారణము ఏమనగా, మనుష్యుడు జంతువులతోను, మృగములతోను, పై చూపిన వాటితో నుండుట వలన, స్త్రీ పురుషుడు సంయోగ సమయమున వారి మనస్సులో ఏ దృశ్యమును తలంచుదురో, ఆ రూపముతోనే శిశువు జన్మించును. సాధారణముగా శిశువు, పుట్టినప్పుడు, తాత పోలిక, మామ పోలిక, తల్లి పోలిక, తండ్రి పోలికలున్నాయని అందురు. కాన ఈ విషయములో నింక ఎక్కువ లోతుకు పోకుండా తెలిసిన చదువరులకు వదలి పెట్టుచున్నాను. (స్వంత)

**9. తొమ్మిదవ ప్రకరణము**

**ఆత్మ - అనాత్మ - పరమాత్మ (సత్యార్థ ప్రకాశము)**

**ఒకటవ అధ్యాయము**

ఆత్మ అనగా జీవుడు (బ్రహ్మ). ఈ ఆత్మ అమరుడు, చావు, పుట్టుక లేదు. స్వతంత్రుడు, సర్వమును, తెలుసుకొనే శక్తివంతుడు. ఈ ఆత్మనే సృష్టి కర్తయనియు, తనకు తాను హిరణ్యగర్భుడై ప్రపంచమునంతయు విస్తరించి తాను ప్రతి శరీరధారుడై అవతరించి, కర్మ - క్రియలతో నిమగ్నుడై యుండువాడు. సైంటిస్టులు, విజ్ఞానవేత్తలు, ఈ ఆత్మ ప్రకృతి నుంచి ఏర్పడినదనియు, అదియే జీవుడను సిద్ధాంతమును అనుసరించి గ్రంథములు వ్రాసిరి. ఉదాహరణకు చిత్రకారులు, విష్ణువు, గర్భము నుండి కమల పుష్పమున బ్రహ్మ ఉదయించునట్లు చూపుచున్నాడు. ఈ ఛాయ చిత్రాలు వెనుక మత పరమైన సిద్ధాంతాలున్నవి. అవి తెలిసినవారు విప్పి చెప్పరు. మరియు యోగులు, ఆధ్యాత్మికులు సైతము పలు విధములుగా చూపినారు. వేదపండితులు, ఆత్మ వేరనియు, బ్రహ్మ వేరనియు, ఈశ్వరుడు అనగా పరబ్రహ్మ వేరుగా

చూపించినారు. ద్వాదశ ఉపనిషత్తులలో కూడ లేరు. వేరు వేరుగా చూపినారు. కాని పరబ్రహ్మ ఒక్కడేయనియు అతనిని ఉపాసనా చేయవలెనని కూడా యున్నది. మహర్షి దయానంద సరస్వతి తన సత్యార్థ ప్రకాశములో చూపినది - ప్రశ్న - ఉత్తరములో ఈ విధముగా చూపినారు.

ప్రశ్నః - జీవుడు స్వతంత్రుడా ? పరతంత్రుడా ?

జవాబు : తన కర్తవ్య కర్మముల యందు స్వతంత్రుడు ఈశ్వరుని వ్యవస్థయందు పరతంత్రుడు. (స్వతంత్ర కర్త) ఇది పాణినీయ వ్యాకరణ సూత్రము - స్వతంత్రుడు - స్వాధీనుడే - కర్త

(సత్యార్థ ప్రకాశము పుట 248 - 249)

మంత్రం : ఇచ్ఛాద్వేష ప్రయత్న సుఖదుఃఖ, జ్ఞానానాత్మనో లింగమి తి॥ (న్యాయం అ।- అ। సూ. 10)

మంత్రం :

ప్రాణాపాననిమేషోన్మేష - మనోగతీంద్రియాంతరవికారా :

సుఖ దుఃఖేచ్ఛాద్వేషౌ - ప్రయత్నశ్చాత్మనోలింగాని ॥ (వైశేషికా అ 3 అ 2 సూ 4)

తాత్పర్యము :

(ఇచ్ఛా) పదార్థములను బొందుటకు అభిలాష (ద్వేష) దుఃఖాదులయందు అనిచ్ఛ, వైరము (ప్రయత్న) పురుషార్థము, బలము - (సుఖ) ఆనందము (దుఃఖ) విలాపము, ఆ ప్రసన్నత (జ్ఞాన) వివేకము అనునవి రెండు శాస్త్రములందును సమానములు.

కాని వైశేషికమందు (ప్రాణ) ప్రాణవాయువును, పీల్చుట, (అపాన) ప్రాణవాయువు వదులుట. ఊపిరి విడుచుట (నిమేష) కన్నులు మూయుట (ఉన్మేష)

కన్నులు తెరుచుట (మనః) నిశ్చయించుట, స్మరించుట, అహాకరించుట (గతి) చలనము (ఇంద్రియ) సమస్తేంద్రియములను, నడుపుట (అంతరవికారః) ఆకలిగొనుట, దప్పిగొనుట, సంతోషించుట, శోకించుట, అనునవి (జీవాత్మ)కు పరమాత్మకంటే భిన్నమగు, గుణములు వీని చేతనే ఆత్మ ప్రతీతి కలుగుచున్నది. ఏలయనగా ఆత్మ స్థూలముకాదు, దేహమునందు ఆత్మయుండు వరకే, ఈ గుణములు ప్రకాశించుచుండెను. శరీరము వదిలిపోగానే యీ గుణములుండవు. ఏదియుండగా, నేవి యుండువో, ఏది లేకున్ననేవి యుండువో, యీ గుణములు దానివే యగును. దీపమును సూర్యాదులును లేక పోవుటచే ప్రకాశదులు లేకపోవుటయు, అవి ఉండుటచే ప్రకాశాదులుండుటయూ (దీప సూర్య భోదకమలగునట్లు) పరమాత్మ జీవుల విజ్ఞానము, వాని గుణముల మూలమున గలుగుచున్నది (పుట సంఖ్య 250 -251)

**2వ అధ్యాయము**

అనాత్మ అనగా శరీరం. ఈ శరీరము ప్రకృతి నుండి పుట్టినది, మరియు జీవుడు పోయిన తర్వాత ఈ శరీరమును ప్రకృతిలోనే అనగా భూమిలోనే సమాధి చేయుదురు. లేక దహనము చేయుదురు. ఈ శరీరములో ఒక్కొక్క మతము ఒక్కొక్క విధముగా దహన సంస్కారములు చేయుదురు. ఉదాహరణకు పారశీకులు - మానవుడు చనిపోయిన తర్వాత, ఈ శరీరమును, ఒక బావి మాదిరిగా కట్టించి, దానిపై కొన్ని ఇనుప సువ్వలు పెట్టుదురు. ఆ సువ్వలపై మృత దేహమును పరుండబెట్టి, కాకులు, గద్దలు, తినునట్లును, మాంసమతయు తిన్న తర్వాత (శల్యములు) ఎముకలు ఆ బావిలో పడిపోవును, తర్వాత వాటిని నన్నింటిని తీసుకొని సమాధిలో పెట్టుదురని తెలియనైనది. ప్రస్తుతము, హిందూ మతములో మనకు ముఖ్యముగా రెండు మతములున్నవి. (1) శైవ మతము (2) వైష్ణవ మతము.

**3వ అధ్యాయము**

శైవ మతము వారు మృత దేహమును భూమిలో ఉప్పును బోసి సమాధి చేయుదురు. శరీరము నుండి మాంసము పోయిన తరువాత శల్యములు అదే విధముగా నుండనట్లును చూచుదురు. ఎందుకంటే ఈ శరీరం యధావిధముగా రెండవ జన్మ ధరించునని వారి అభిప్రయము. వీరే కాకుండా అచల పరిపూర్ణులు, శిశ్యత్వము తీసుకున్న ఆధ్యాత్మికలు కూడా సమాధియే చేయుదురు. కాని యిప్పుడు శైవులు కూడా దహన సంస్కారము చేయుచున్నారు.

**4వ అధ్యాయము**

వైష్ణవ మతము - వీరు చాలామట్టుకు దహనము చేయుదురు. కాని గురువు ఉపదేశము తీసుకున్నవారు సమాధియే నెంచుదురు. ఈ విషయమున భారత దేశములో పలు పలు విధములుగా, వారి వారి ప్రాంతముల లోనున్న సంస్కారమున చేయుదురు. ఈ విషయముపై వ్రాయాలంటే చాలాయున్నది. కనుక ఇక్కడనే ముగింపు చేయుదును.

**5వ అధ్యాయము**

పరమాత్మ - పరమాత్ముని గురించి భిన్న భిన్న అభిప్రాయములున్నవి. పరమాత్ముడనేవాడున్నాడా ? అనేవారు, నాడు నేడు కలరు. కాని వారు మరొక రూపమున ఒప్పుకున్నట్లు కనబడుచున్నది. ఆధ్యాత్మికులు, మతగురువులు, విజ్ఞాన వేత్తలు, జ్ఞానులు, సహితము పలు విధములుగా చెప్పుచున్నారు. మరియు శబ్ద ధాతువును బట్టి చూచిన మనకు సంకోచితముగా నుండును. అందువల్ల నాస్తికులు సైంటిస్టులు, విజ్ఞాన వంతులు, నాటి ఋషి, మునులు సైతము భిన్న అభిప్రాయములు తెలిపినారు. శబ్ద ధాతువు నుండి అర్థము, ఏ విధముగా నున్నది ఈ దిగువ నుదహరించుచున్నాముః-

**10.** పదవ ప్రకరణము

**ఆత్మ - అనాత్మ - పరమాత్మ - శబ్దార్థములు**

**1. అధ్యాయము**

**1) పరమాత్మ :** ఇతర ఆత్మలను తెలుసుకొనేవాడు - పరమాత్ముడు.

**2) ప్రభు :** ప్రళయ - భూగర్భుడు అనియు పండితులు తెలుపుచున్నారు. కాని ఇక్కడ ప్రళయి భూత్ అని యుండవలెను. భూత్ అనగా కంటికి కనబడనిది, ఒక శక్తియనీయు (సుప్రిమ్ పవర్) అన్నింటికన్న పూర్వము మొకటి యుండెననియు, భూత్ - భవిష్యత్, వర్తమాన్, అని మనము చెప్పుకుంటాము. దిని గురించి వేద మంత్రములోనిది ఈ విధముగా యున్నది.

**మంత్రం :**

ఓం హిరణ్య గర్భ సమవర్తాతాగ్రే, భూతస్యజాతః పతి రేక ఆసీత్
సదా ధారపృథ్వివిమ్, ద్యాముతేమాం, కస్మై దేవాయ అవిశావిదేమా ॥

**తాత్పర్యము :**

ఈ మంత్రము యొక్క అర్థమున, హిరణ్య గర్భుడు తనకుతానే ఉద్భవించెను. అనగా సృష్టి (అగ్ని) భూత సంజాతః అనగా ఏ భూతము యొక్క (టోస్) వత్తిడి వల్ల అగ్ని ఏర్పడినది. తర్వాత పంచ భూతములు ఏర్పడినవి. దీని వివరము మొదటి అధ్యాయమున చూపినాము. కనుక ''ప్రళయ - భూత్'' ఇదియే సరియైనదని ప్రళయ నుండి ప్ర అక్షరము - భూత్ నుండి భు అక్షరమును తీసుకొని - రెండు అక్షరములు కలిపిన ''ప్రభు'' యని కనబడుచున్నది (స్వంత).

**3) భగవాన్** - లేక భగవంతుడు అనగా భగము స్త్రీ యోని వాన్ అనగా తుండు భగము తుండు యని తెలియచున్నది.

**4) దేవుడు** - దేవు - ఇచ్చువాడు లేక దేనేవాల.

**5) మహా ఆత్మ** - అన్ని ఆత్మలలోనికన్నా పెద్ద, గొప్పదనియు కనబడుచున్నది.

**6)** పరమేశ్వర - ఈశ్వర పదమునకు చెందును.

**7)** పరమ దయాల్ - దయాలు లందరికన్న మించినవాడు (గొప్ప దానకర్త)

**8)** కృష్ణ - అనగా నలుపు - నలుపుగా నుండు వాడు, కృష్ణ పక్షము అనగా చీకటిగా యుండు (15 రోజులు) అనగా అమావాస్య వరకు లేక ఒక గొప్ప వ్యక్తి కాని పరమాత్మగా జాలడు.

**9)** రామ - రామ అనగా (విరామ్) ఇక్కడ జీవి - జన్మమును విరమించుట లేక శరీరదారుడు గాకుండుట, రామ పదము గురించి చాలాయున్నది. దశరథ రాముడు ఒక మహారాజు, ఏకపత్నీవ్రతుడు, రాజకీయములలో గొప్ప పేరు తెచ్చుకున్నాడు, కాని ప్రభువు కాజాలడు. ఈ రామ అనేది షట్ చక్రముల లోని చివరి స్థానము. దీనిని పొందిన వారే (విరామ) పొందుతారు. అనగా ఆ జీవకి మోక్షము కలుగును. మరల రెండవ జన్మలేదు. కనుక ఆ స్థానము యింత వరకు ఎవరును పొంత జాలలేదు, పొందను లేదు. కృష్ణుడు సహితము పొందలేక, మరల రెండవ జన్మ సమయానుకూలముగా వస్తానని నుడివినట్లు భగవత్ గీతలో చూపినారు. ఇదియును గాక రామ - రామ అను పదములు కూడా విచారించినట్లువుతే మీకు స్వయంగా తెలుసుకోగలరు. ఎక్కువగా చర్చించకోదలచలేదు. ప్రతి ఒక పదమును ఒక అర్థము యున్నది. ఆ శబ్ద ధాతువును బట్టి తెలుసుకొన్నట్లువుతే, ఇక్కడ నాస్తికత్వము అగుపడును. ఇంక ఎక్కువ లోతుకు పోకుండా, ఈ పై చూపిన పదములు పురుష లింగమునకు జెందినవిగాను, యిప్పుడు స్త్రీ లింగమునకు చెందిన పదములను కూడ వాడిన పేరు చూడవలెను.

## ఆత్మ - ఆనాత్మ - పరమాత్మ శబ్దార్థములు

**10)** పరాశక్తిః అనగా ఇతర శక్తులను తెలుసుకున్నదియే పరాశక్తి. శక్తి అనగా శబ్దార్థము, బలము, బలవంతుడు, బలవంతురాలు, అనియు నెంచుదురు.

**11)** ఆదిశక్తి : అన్నిటికన్న ముందు యున్నది. అదే - లేక మొదటి శక్తి.

**12)** పార్వతి : అనగా పర్వత రాజు కూతురని చెప్పుదురు. కాని దేవి భాగవతమందు,

ఆదిశక్తియే మూడు అవతారములుగా ఎత్తినదని, త్రిమూర్తులకు భార్యగా నుండెనని యున్నది. పార్వతి అనగా పర్వతము. గట్టితనము లేక రాయి - ఎంత శక్తి గలదో, ఈ పార్వతి కూడ అంత శక్తి గలదని చెప్పుదురు. ఈమె శివుని భార్య, శివ పార్వతులకు ఎన్నియో పేర్లు గలవు.

**13)** లక్ష్మిః ప్రకృత్యైనమః లక్ష్మి అనగా ధాన్యము, ధనము మరియు ప్రకృతిని కూడా అందురు. లక్ష్మి శతనామములలో మొదటి నామము, ప్రకృత్యైనమః అని యున్నది. ప్రకృతి నుండి వచ్చినది. ధాన్యము, ధనము, అని కలదు. ప్రకృతికి - విష్ణువు అని గలదు. ఆ విష్ణువుకు తోడుగా నుండగల శక్తి విష్ణు భార్య లక్ష్మి.

**14)** సరస్వతి : సరః జ్ఞానము అస్వాః అస్తితి సరస్వతి, వ్యుత్పత్తి అర్థము, లేక స్వయునకు హితువు నిచ్చునది. బ్రహ్మ భార్యయని అందురు. బ్రహ్మలనగా జీవు, జీవునకు తోడు నుండగల శక్తి అయనియే చెప్పుదురు. ఇక్కడ నింక ఎక్కువ పోకుండ అతి ముఖ్యమైన మూల వ్యక్తుల గురించి చూపడము జరిగినది. దీనికి మూలము - వజ్ర ఉపనిషత్తు మరియు చార్వకుల సిద్ధాంతము నుండియే కనబడినది.

పైన చూపిన దేవతల పేర్లతోనున్న శబ్ద ధాతువుతో చూపిన దానిలో రామ అను పదమునకు కొంత బలము చేకూర్చుటకు చూపనైనది. అప్పటికున్న దేవ - అసురుల బాధల నుండి రక్షింపవాడుగా ఈ దశరథ కుమారుడైన వరపుత్రునికి, విశిష్ట మహా ఋషి ఈ ''రామ'' అనే పేరు పెట్టెను. ఈ రామ శబ్దమునకు ( ర వుండే యోగినః ఆస్మిక ఇతిరామః) రామ శబ్దార్థము. రాక్షసుల దౌర్జన్యమును అరికట్టుట కనియున్నది. అంటే రామ పదమునకు ఎంతశక్తి గలదో, మీరు తెలుసుకోగలరు. కాని పౌరాణిక బ్రాహమ్మణులు వీరందరిని అవతార పురుషులుగా నెంచి, వారిని పూజింపసాగిరి. మరియు దశ అవతారములుగా లెక్కించిరి. ఇప్పుడు దశ అవతారాలుగా నెంచి, వారిని పూజింపసాగిరి. మరియు దశ దశావతారములు పోయి పదమూడు అవతారములకు

పెరిగినది. ఈ అవతారములు ప్రతి మనిషికి యున్నది. అదియే రెండవ జన్మ. దీని గురించి ఎక్కువ వ్రాయనక్కర లేదు: పై జూపిన శబ్ద రూపములతో జూపిన విషయమును గురించి తెలుసుకోగలరు. మరియు నాస్తికులు ఎవరు? అనునది సమస్యను పరిశీలించవలెను.

**2వ అధ్యాయము**

**నాస్తికులు**

నాస్తికులు అనగా నిరాశావాది, వీరు కూడా ఒక మతమును నమ్మతారు. అదియే ప్రకృతి మతము. ఈ మతముల గురించి 8వ ప్రకరణముతో చూపినాము. నాస్తికము అనగా నిరాశవాది, ఆశలేని వారు, దేనిని నమ్మని వారు, తనకు తాను అహంబ్రహ్మ' యని తలంచువాడు, ఈ కోవకు చెందిన వారు చాలా గలరు. కాని నాస్తికుడు ఒకదానిని నమ్ముచున్నాడు కదా, శరణు తీసుకుంటున్నాడు, కనుక అతను నాస్తికుడు కాజాలడు. నాస్తికత్వము ఒక సృష్టికర్తకు చెందును.

**3వ అధ్యాయము**

**ఆస్థికుడు**

ఆస్తికుడు అనగా ఆశావాది, శరణు తీసుకొనువాడు, సృష్టికర్త యున్నాడని నమ్మువాడు. అనగా తనకు జన్మ యిచ్చినవాడు (తండ్రి) ఇక్కడ పరమాత్ముడున్నాడని వారి అభిప్రాయముతో నున్నవారు. వీరు రెండవ జన్మ వున్నదని నమ్మువారు.

పై చూపిన విషయములను చూపినది, ఎవరు నమ్మిన, నమ్మకపోయిన నాకు తెలిసిన విషయాన్ని మీ ముందు పెట్టినాను, కాని వామ మార్గులు , వొప్పుకోరు, కాని పౌరాణికులు కొంత మాత్రము ఒప్పుకోగలరు. నిజా నిజాలను ఎవరు చెప్పినా నమ్మువారు చాలా తక్కువ, నా ధర్మము నేను నిర్వర్తించినాను. కాన చదువరులు తెలుసుకోగలరని ఆశిస్తున్నాను.

## 11. పదకొండవ ప్రకరణము

## ఆత్మ - జీవాత్మ - పరమాత్మ (సత్యార్థ ప్రకాశము)

### 1వ అధ్యాయము

**1) ఈశ్వరుడు :** ఈశ ఐశ్వర్యే - కర్తుం - అకర్తుం, అన్యధా కర్తుం యం, ఈష్టేసపాప ఈశ్వరః - అని ఈశ్వర శబ్దార్థము (ఈశ్వర) శబ్దము సిద్ధమగుచున్నది. సామర్థ్య వంతున - ఈశ్వరుండని పేరు. (య ఈష్టే సర్వైశ్వర్యవాన్ - వర్తతేస ఈశ్వరః) అతనికి సత్యవిచారము - శీలజ్ఞానమును, అనంతైశ్వర్యమును గలదు, కనుకనే పరమాత్మకు ' ఈశ్వరుడని' పేరు.

**2) విష్ణువు :** (విష్వాప్తౌ) ఈ ధాతువుతో 'ను' ప్రయత్నము చేరి విష్ణు శబ్దము సిద్ధమగు చున్నది. (వేవేష్ఠ వ్యాప్నోతిచరాచరం జగత్సవిష్ణుః) చరాచరమగు జగత్తునందు వ్యాపకుడగుటచే పరమాత్మకు 'విష్ణు'యని పేరు.

**3) బ్రహ్మః** వాయోతే బ్రహ్మణేనమో అస్తు. బ్రహ్మ బృబృహి వృద్ధౌ ఈ ధాతువుల నుండి 'బ్రహ' శబ్దము సిద్ధమగుచున్నది. త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి) నీవే అంతర్యామి రూపముచే బ్రత్యక్ష బ్రహ్మమంత్రం.

**4) దేవుడు :** దివు క్రీడా విజిగీషా వ్యవహారము ద్యుతిస్తుతి మోదమద స్వప్నకాంతి గతిషు. ఈ ధాతువు నుండి 'దేవ' శబ్దము సిద్ధమగుచున్నది (దివ్యతతిదేవః)

**5) పృధవీ :** (ప్రధవిస్తారే) ఈ ధాతువు నుండి 'పృధివీ' శబ్దము సిద్ధమగుచున్నది.

**6) జీవుడు :** (యనన సాధ్యాయతితద్వాచా వదతియద్వాచవదతి తత్కర్మణా కరోతియత్, కర్మణాకరోతి తదభిసంపద్యతే)

ఇది యజుర్వేద బ్రాహ్మణవచనము ''జీవుడు'' మనస్సుతో తలచుదానిని, వాక్కుతో చెప్పుదానిని జేయును, చేయు దానిని బొందును. దీనివలన జీవుడెట్టి కర్మమును జేయునో, అట్టి ఫలమును పొందునని, సిద్ధమగుచున్నది. దుష్టకర్మమొనర్చు జీవులు ఈశ్వరుని న్యాయ రూపమగు వ్యవస్థచే దుఃఖ రూప ఫలమును బొందునపుడు, ఏడ్చుదురు. ఈ ప్రకారమీశ్వరుడు వారి నేడ్పించువాడును, కావున పరమేశ్వరునకు

నామము.

**7) నారాయణుడు : శ్లోకము**

ఆపోనార్నా ఇతిప్రోక్తా - ఆపోలైన రసూనవః, తయాదస్యాయనం, పూర్వంతే

నాయణ న స్మృతం: (మను అ 1 శ్లో 10). నారాః అనునం యస్యసః నారాయణం, జలము జీవులు వీనికి నారాయని పేరు. ఆ వియతని కయనమనగా, నివాస స్థానము కాబట్టి, సమస్థ జీవులయందు వ్యాప్తుడగు పరమాత్మని నామము, 'నారాయణుడు'.

**8) అద్వైతము :** ద్వియోర్భావోద్యాభ్యామితం, సాద్వితా ద్వీతం - వాసైవతదేవ వాద్వైతమ్. నవిధ్యతే ద్వైతం, ద్వితీయేశ్వర భావోయ స్మింస్థద ద్వైతమ్. అర్థాత్ సజాతీయ విజాతీయ స్వగత భేదశూన్యం బ్రహ్మ. (రెండుగా గాని రెంటితో గలసిగాని యుండుట ద్వితము లేకద్వైతము అనబడును. ఇది కానిది అద్వైతము. మనుష్యునకు, మనుష్యుడు సజాతీయును, మనుష్యుని కంటే భిన్నమగు వృక్షపాషాణాదులు విజాతీయములు. శరీరమందు కన్ను - ముక్కు - చెవి - మున్నగునవ యవభేదము స్వగతము. ఇట్లు రెండవ స్వజాతీయేశ్వరుడు. కాని విజాతీయేశ్వరుడు, కాని తన ఆత్మయందు తత్త్రాంతర వస్తువగు స్వగత భేదము కాని, లేక పరమేశ్వరుడొక్కడే కాబట్టి పరమాత్మకు 'అద్వైతము' మని పేరు.

**9) అంతర్యామి :** (అంతర్యం తుంనియంతుం శీలం యస్యసో ఆయంమంతర్యామీ). సమస్తమైన ప్రాణిరూపమును, ఆ ప్రాణి రూపమునుకు, జగత్తు నందునుటను వ్యాపకుండయి, అన్నిటిని - నియమించువాడు, కాబట్టి పరమేశ్వరునకు 'అంతర్యామి' అని పేరు.

**10) ధర్మరాజు :** (యోధర్మరాజతేసధర్మరాజః) ధర్మమందే ప్రకాశమానుండును, అధర్మరహితుడును, ధర్మమునే ప్రకాశపరచువాడును, అగుటచే పరమేశ్వరునకు

'ధర్మరాజు' పేరు.

**11)** **యముడు :** (యమ ఉపరమే) ఈ ధాతువు నుండి 'యమ' శబ్దమేర్పడుచున్నది. (యః సర్వాన్ - ప్రాణినోనియచ్ఛతిసయమః). సమస్త ప్రాణులకు కర్మ ఫలముల నిచ్చుటకు దగిన వ్యవస్థ చేయువాడును, ఎల్ల అన్యాయములకు దూరమయిన వాడునగుటచే పరమాత్మకు 'యముండ'ని పేరు.

**12)** **భగవంతుడు :** భజసేవాయమ్ ఈ ధాతువు నుండి 'భగ' శబ్దమును, దీనితో (మతుప్) కలిసి 'భగవాన్' శబ్దమును ఏర్పడుచున్నది. భగః సకలైశ్వర్యం - సేవనం వావిద్యతేయు స్యస 'భగవాన్' - సమగ్రైశ్వర్యయుక్తుండను, భజించుటకు యోగ్యుడునగుట వలన ఈశ్వరునకు 'భగవంతుండని' పేరు.

**13)** **మహా దేవుడు :** 'మహత్' శబ్ద పూర్వక 'దేవ' శబ్దముచే మహాదేవ శబ్దమేర్పడుచున్నది. (యోమహతాం దేవః సమహాదేవ) - గొప్పదేవుల కందరుకును దేవుడు, విశ్వాంసులకు విద్యాంసుడును, సూర్యాది పదార్థములకు, ప్రకాశకుడు నగుట వలన పరమాత్మకు 'మహాదేవుడని' పేరు.

**14)** **శంకరుడు :** (డుకృఞ్కరణే) 'శమ్' పూర్వకమైన ఈ ధాతువు నుండి 'శరకం' శబ్దమేర్పడుచున్నది. (యః శంకళ్యాణం - సుఖం కరోతినశంకరః) - కళ్యాణము - సుఖము గలుగ జేయువాడు గనుక ఈశ్వరునకు 'శంకరుడని' పేరు.

**15)** **స్వయంభువు :**(భూసత్తాయామ్) 'స్వయం' పూర్వకమగు 'భూ' ధాతువు నుండి 'స్వయంభువు' - శబ్దమేర్పడుచున్నది. (యః స్వయంభవతిసస్వయం భూర్వీశ్వరః) తనంతటనే యున్నవాడు, ఏవని నుండి గాని యెన్నడు గాని యుత్పన్నమైనవాడు కాదు. అయోనిజుడు, కాబట్టి పరమాత్మకు 'స్వయంభు' అని పేరు.

**16)** **శివుడు :** (శివుకళ్యాణే) ఈ ధాతువు నుండి 'శివ' శబ్ద మేర్పడుచున్నది (బహులమేతాన్ని దర్శనమ్). దీనిచే శివుధాతు అనుబడును. కళ్యాణ స్వరూపుండును,

కళ్యాణ కారి యగుటచే పరమేశ్వరునకు 'శివుండని' పేరు. పరమేశ్వరునకు నూరు పేర్లు తెలుపబడినవి. అందు నుండి కొన్నింటిని మాత్రము తీసుకొనుచున్నాము. ఇక్కడ 'శివ' మను శబ్దమునకు యోగ శాస్త్రమందు నీ విధముగా నున్నది. (శివ మనగా నాసికము) నాసికము నుండి వాయువును పీల్చుట - వదులుట వలన (శి - నాసికము - వ వాయు) 'శివ' అనే పదము ఏర్పడినదని చూపినారు. పరమేశ్వరునకు పై నామములుగాక జ్యోతిష్ గ్రహనామములకు గూడ చూపబడుచున్నవి.

## 2వ అధ్యాయము

### జ్యోతిష్ గ్రహ నామములు

**1) సూర్యుడు :** (సూర్య ఆత్మా జగత్తస్తుషశ్చ) ఈ యజుర్వేద వచనము చేత జగత్తు అనగా ప్రాణి కోటి అనగా చేతన - జంగమములు. 'తస్థుషః' అనగా ఆ ప్రాణులు - స్థావర జడములు - పృథ్వ్యాదులు, వీని కన్నింటికి నాత్మయు, స్వప్రకాశస్వరూపుండును, అన్నింటిని ప్రకాశించువాడు, అగుట చేత పరమేశ్వరునకు సూర్యుండను పేరు.

**2) చంద్రుడు :** (చది ఆహ్లాదే) ఈ ధాతువు నుండి 'చంద్ర' శబ్దము సిద్ధమగుచున్నది. (యశ్చందతి - చంతయతివాస చంద్రః) - ఆనంద స్వరూపుడు, అందరకు నానందమునిచ్చువాడు, అందువలన ఈశ్వరుని నామము 'చంద్రుడు'.

**3) మంగళుడు :** (మగిగతౌ) ఈ ధాతువు నుండి (మంగేరలచ్) సూత్రముచే 'మంగళ' శబ్దము సిద్ధము అగుచున్నది. (యోమంగతి మంగయతి వాస మంగళః) తాను మంగళ స్వరూపుడు. సమస్త జీవుల మంగళమునకు గారణుడు. అందువల్ల నపరమేశ్వరునికి 'మంగళుడు' అని నామము.

**4) బుధుడు :** (బుధ అవగమనే) ఈ ధాతువు నుండి 'బుధ' శబ్దము సిద్ధమగుచున్నది. (యో బుధ్య తే బోధయతి వాస బుధః) స్వయంబోధ స్వరూపుడు, సమస్త జీవులకు

బోధ కుంగారణుడు, కావున నా పరమేశ్వరుని నామము 'బుధుడు'.

**5) గురుడు :** (గృహ శబ్దే ) ఈ ధాతువుచే 'గురు' శబ్దమేర్పడినది. (యోధర్మాన్ శబ్దాన్, గృణాత్యుపదిశతిసగురుః) న పూర్వేషామపిగురుః కాలేనాన వచ్ఛేదాత్. (యోగను - సమాదిపాదము - సూ - 26). సత్యధర్మ ప్రతిపాదకుడు, సకల విద్యా యుక్తమగు వేదములను ఉప దేశించువాడు - సృష్టి ఆరంభమందు, అగ్ని, వాయువు), ఆదిత్యుడు, అంగీరుడు, బ్రహ్మ, మొదలగు గురువులకు గురువై యెన్నటికీ నాశనము నొందని వాడు, కావున ఈశ్వరుడు 'గురువు'.

**6) శుక్రుడు :** (ఈషుచిర్పూతీభావే) ఈ ధాతువు నుండి శుక్ర శబ్దము సిద్ధమగుచున్నది. (యః శుచ్యతి శోచయతివాసశుక్రః) అత్యంత పవిత్రుడు అతని సంగతిచే జీవులు పవిత్రులగుదురు. కావున ఈశ్వరుని నామము 'శుక్రుడు'.

**7) శనీశ్వరుడు :**(శనీశ్చరుండు) (చరగతి భక్షణయోః) ఈ ధాతువునకు 'శనైస్' అత్యయము ఉపపదమై 'శనైశ్చర' శబ్దము సిద్ధమగుచున్నది. (యఃశనైశ్చరతిసశనైశ్చరః) అన్నిటి యందును, సహజముగా బ్రాప్తించిన ధైర్యవంతుడు, కావున పరమేశ్వరుడు 'శనైశ్చరుడు'.

**8) రాహు :** (రహత్యాగే) ఈ ధాతువు నుండి 'రాహు' శబ్దము సిద్ధమగుచున్నది. (యోరహతి పరిజ్యతి దుష్టాన్ - రాహయతి త్యాజయతి వాసరాహురీశ్వరః) ఏకాంత స్వరూపుడు, తన స్వరూపమందుని తరపదార్థ సంయోగము లేనివాడు, దుష్టులను, దాను వదలి యితరులను వదిలించువాడు. కావు ఈశ్వరునికి నామము రాహువు.

**9) కేతువు :** (కితిని వాసే రోగా పనయనేచ) ఈ ధాతువు నుండి 'కేతు' శబ్దము సిద్ధమగుచున్నది. (యః కేతయతిచికిత్సతివాస కేతు ఈశ్వరః) సమస్త జగత్తునకు నివాస స్థానము, సమస్త రోగ రహితుడు, ముముక్షువులను ముక్తి సమయము నందు, సమస్త రోగముల నుండి వదిలించువాడు - కావున పరమాత్ముని నామము 'కేతువు'.

ఓం

**3వ అధ్యాయము** పర్వదినములు

1) **ఉగాది** -- తెలుగు వారి క్రొత్త సంవత్సర దివసము. ఈ ఉగాది సృష్టి ఉద్భవించిన దినము. అనగా సృష్టి పుట్టినరోజు, ప్రకృతి జన్మించినది. ప్రకృతిలోని చెట్లు-చిగురు వేయడం వంటివి. ఫలములు, కాయలు, పంటలు, ఈ వన్నింటియు బట్టియే మన పూర్వీకులు నిర్ణయించిన దినము. ఇదియునుగాక యుగ ప్రారంభ దివసమని కూడా చెప్పవచ్చును.

2) **శ్రీరామనవమి** - అనగా శ్రీరాముడు పుట్టిన దినము మరియు అతని వివాహ దివసము. చైత్రశుద్ధ నవ మీలు, మరియొక పంచాంగములో పాల్గుణమాసముయని కనబడినది.

3) బుద్ధపూర్ణిమ - అనగా బుద్ధుడు పుట్టిన దినము. వైశాఖ శుద్ధ పౌర్ణమీలు.-

4) **తొలి ఏకాదశి** : ఆషాఢ శుద్ధ ఏకాదశి. పౌరాణిక పండుగలలోని మొదటి పండుగ దివసము. వైష్ణవ సాంప్రదాయకులు ఎక్కువ పాటింతురు.

5) **రాఖీపౌర్ణమి** : రాఖీ బంధనము - ఉపనయనము చయు దివసము - వేదసప్తహము - శ్రావణ పౌర్ణమి

6) **శ్రీకృష్ణాష్టమి** : శ్రీకృష్ణుడు పుట్టిన దినము .-

7) **వినాయకచతుర్థశి** : వినాయకుడు పుట్టిన దినము.-

8) **మహాళియ అమావాస్య** - పితృతర్పణ దివసము. భాద్రపద పౌర్ణమీ నుండి అమావాస్య చివర రోజు

9) **విజయదశమి** :- మహిషాసురుని వధించి, విజయము ప్రాప్తించిన రోజు, మరియు పాండవులు జమ్మిచెట్టు పైన శాస్త్రములు తీసుకొనిన రోజు - విజయదశమిలు.-

10) **దీపావళి** :- శ్రీకృష్ణుడు నరకాసురుని వధించి, వేడుకలు చేసుకున్న రోజు, ఇదియునుగాక వర్ష ఋతువు అంతిమ దివసము - అందువల్ల దోమలు - పురుగుపూసి దూరము అవుటకు గంధకములు కాల్చుట రోజు :-

11) **కార్తీక పౌర్ణమి** : ఈ కార్తీక పూర్ణిమ అతి ముఖ్యమైన రోజు, కార్తికేయుని యొక్క దివసము. మరియు భూదానము, ఇతర దానము చేయుట రోజు. కార్తీక పౌర్ణమి.-

12) **మకర సంక్రాంతి** : సూర్యుడు ఉత్తరాయణము నుండి, దక్షిణాయనమునకు పోవు దివసము, మకర సంక్రాంతి - మరియు బలి చక్రవర్తి దివసము.-

13) **మహాశివరాత్రి** : శివుడు విషపాయసము తీసుకున్న రోజు, కనుక శివుని గురించి ప్రార్థన చేయు రోజు, శివరాత్రి -

14) **కామదహనం** : ఇది ఎక్కువ రాజస్థాన్ వారి కాముడు అను వ్యాపారి చనిపోయిన రోజు, మరియు ప్రహ్లాదున్ని - హిరణ్యకశ్యపుడు, మంటలోపంపిన దివసము అని పౌరాణికులు చెప్పుదురు. కామదహనం, పాల్గుణ శుద్ధ పౌర్ణమీలు.-

15) **హోలి** - వసంతోత్సవము, లేక దులండి. అనగా చలికాలము వెళ్లి, ఎండాకాలము ప్రారంభ దివసము, అందువల్ల ఎండలకు భరించుటకు, గోగిపూవ్వు రసాయముతో స్నానము చేయు రోజు, కాని యిప్పుడు రంగులు, పేడనీళ్ళతో ఆడుట, - హోళి -

చేయుచున్నారు. మరియు ధనము కూడ కోట్లు, కోట్లు ఖర్చు చేసి యంత్రములతో, టెలిస్కోపుల ద్వారా, శాటిలైట్ వంటి గ్రహములతో పరిశోధనలు జరుపుచున్నారు. కాని సృష్టి మూలమును, భూమి యొక్క అడుగు భాగంనుగాని తేల్చలేక పోతున్నారు. ఐతరేయ బ్రహ్మణములో సృష్టిని ఉత్పత్తి చేసినవారిని గురించి తెలుసుకోకపోవడం మంచిదని నుడివినారు. కాని మేము, సృష్టి ఏ విధముగా జరిగినది, దాని కర్త ఎవరు, అనునది సైన్సు రూపంలో చూపబడినది ముఖ్యముగా ఈ విషయము వరకు చూపాలన్నదే నా ధ్యేయము అయినా సృష్టి యొక్క పరిణామము వేద మంత్రము నుండియే చూపడం మరియు నిరూపించుటకు ప్రయత్నము చేసితిమి. నాకు అంత అర్హత కూడా లేదు. అయిన అది దైవ సంకల్పము వల్లనే ఈ మహత్తర కార్యమును, చిన్న గ్రంథ రూపమున మీ ముందు చూపగల్గినాము. పెద్దలు, చదువరులు ఈ గ్రంథమును చూచిన తర్వాత ఏమైనా తప్పులు, ఒప్పులు ఉన్నచో చూపగలరని ఆశిస్తున్నాను. -